

# వరవిక్రయము.




గ్రంథకర్త:

[redacted]

కాళ్లకూరి నారాయణరావుగారు







# గొప్ప జ్యోతిష గ్రంథములు



| | రు. | అ. |
|---|---|---|
| జ్యోతిష ప్రథమబోధిని | 0 | 8 |
| జాతకమార్తాండము 1భా॥ | 1 | 8 |
| ,, 2 భా॥ | 1 | 8 |
| ,, 3 భా॥ | 2 | 0 |
| జ్యోతిషవిద్యాప్రకాశిక | | |
| సంజ్ఞాధ్యాయము 1 భా॥ | 1 | 0 |
| గణితాధ్యాయము 2 భా॥ | 1 | 0 |
| భావఫలాధ్యాయము 3 భా॥ | 3 | 0 |
| ద్వాదశభావఫలము 4 భా॥ | 2 | 0 |
| అదృష్టదీపిక | 0 | 10 |
| హస్తసాముద్రికము | 0 | 6 |
| జ్యోతిష ఫలప్రదర్శిని | 0 | 10 |
| దశాభుక్తి ఫలచంద్రిక అను వృద్ధపారాశరి | 1 | 0 |
| పుట్టుమచ్చలశాస్త్రము | 0 | 8 |
| జాతకచంద్రిక గోపాల రత్నాకరము | 0 | 8 |
| మయువాస్తు, వాస్తుశిరోమణి, సనత్కుమారవా } ఈ 3 చేర్చి ఒకే పుస్తకం | 0 | 12 |
| వాస్తుసంగ్రహము | 0 | 12 |
| నవగ్రహచింతామణి | 0 | 2 |
| శిల్పవాస్తు | 0 | 12 |

| | రు. | అ. |
|---|---|---|
| జాతకఫలమణిమంజరి 1వ | 1 | 8 |
| గర్గసంహిత | 0 | 4 |
| బృహత్పారాశరసంహిత | 0 | 4 |
| ఆంధ్రజాతకతత్వము | | |
| సూత్రములు 1 వ భా॥ | 1 | 8 |
| ,, 2 వ భా॥ | 1 | 8 |
| గోచారసంహిత | 0 | 12 |
| కాలామృతము | 0 | 12 |
| శిల్పసంగ్రహము | 0 | 6 |
| ఆయుర్దాయయోగం | 1 | 0 |
| ముహూర్తదర్పణం | 0 | 8 |
| రెట్టమతశాస్త్రము 60 సం॥ పంచాంగము | 0 | 12 |
| జాతక నారాయణీయం | 1 | 8 |
| స్వప్నఫలదీపిక | 0 | 8 |
| సకలసర్వగుణఅదృష్టదీపిక | 0 | 10 |
| గౌతమసంహిత | 0 | 8 |
| వాంఛానాదీయం | 0 | 8 |
| జాతకరాజీయం | 1 | 0 |
| జ్యోతిష ఫలగ్రంథము | 0 | 2 |
| శకునశాస్త్రం | 0 | 8 |
| స్త్రీజాతకం | 0 | 8 |

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు, బుక్సెల్లర్సు, రాజమండ్రి.

# వరవిక్రయము

(సాంఘిక ప్రహసనము)

చింతామణీ [illegible] కర్త

మహాకవి

## కాళ్ళకూరి నారాయణరావు

ప్రణీతము



ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

1947

[వెల రు 1—8—0

# ఇందలి పాత్రములు



1 కాళిం=కాళింది=మొదటి పెండ్లికొమార్తె } అక్కచెల్లెండ్రు
2 కమ=కమల=రెండవ పెండ్లికొమార్తె
3 పురు=పురుషోత్తమరావుగారు=పెండ్లికొమార్తెల తండ్రి.
4 భ్రమ=భ్రమరాంబ=పెండ్లికొమార్తెల తల్లి.
5 బస=బసవరాజు=పెండ్లికొమరుఁడు.
6 లింగ=లింగరాజుగారు=పెండ్లికొమరుని పెంపుడుతండ్రి.
7 సుభ=సుభద్ర=లింగరాజుగారి భార్య.
8 పేర=పెండ్లిండ్ల పేరయ్య=ఒక దళారీ.
9 వీర=వివాహాల వీరయ్య=ఇంకొక దళారీ.
10 న్యాయా=న్యాయాధిపతి.
11 ఘంట=ఘంటయ్య=లింగరాజుగారి వంటబ్రాహ్మణుఁడు.

ఒక టీచరు- ఒక బ్రాహ్మణుడు- ఒక కమ్మ- ఒక సెట్టి- వీరు తాత్కాలికులు.

శ్రీ

మేధా దక్షిణామూర్తి పరబ్రహ్మణే నమః

# వరవిక్రయము



## నాంది

భూరి వసిష్ఠ మై, విబుధ ♦ పుంగవ మంగళ వాక్సమృద్ధ మై,
చారుతరాప్సరో నటన ♦ సంభృత మై, సవినోద మై, యహం
కార వికార దూరమయి ♦ గర్వ వ్రతతి భయశుల్క శూన్య మై
గౌరి వివాహసంస్మరణ ♦ కెల్లఁగఁ జేయుఁడుం గాక ! భద్రముల్.

## ప్రస్తావన

సూత్ర—(ప్రవేశించి) ఓహో ! యేమి యీ సభాసమ్మర్దము ! ఆ మహాకవి కావ్యము లనంగానే యభిజ్ఞుల కేమి యాదరము ! (పరిక్రమించి) ఓ సభాస్తారులారా ! వర్తమాన వరశుల్క దుర్న్యయదూరీకరణమునకై బుద్ధరాజు వీరభద్రరాయామాత్యులవార కంకితముగా, మహాకవి కాళ్ళకూరి నారాయణరావు గారిచే రచింపఁబడిన వరవిక్రయ రూపకమును విలోకించు నిమిత్తము విచ్చేసిన మీ యెడ నే నత్యంతముఁ గృతజ్ఞుఁడను ఏమనుచున్నారు ?

"సీ. కవి ప్రసిద్ధుఁడు; కావ్యమా ♦ కాలవిహిత
మైనయది; మీరలా భర ♦ తాగమమునఁ
జతురు; లటుగాన, మీ ప్రద ♦ ర్శనముకొఱకుఁ
ద్వరపడుచు నున్నవార ముం ♦ తయును మదిని."

అనియా?—చిత్తము చిత్తము—ఇదిగో యిప్పుడే యుపక్రమించెదము. (తెరవంకఁ జూచి) ఓసీ ! ఓసీ ! యెక్కడ ! ఒక్కసారి యిటు రమ్మా.

నటి—(ప్రవేశించి) ఏమా యధికారము ! నాసి పాటిపెటినట్లు గొంతు చించుకొనుచున్నారే ?

సూత్ర—ఓసీ దేబ్యా! [illegible] గాక నిన్నుఁ గొనిపోనివచ్చితి నంటే ? నీతండ్రి కిచ్చిన వేయిరూపాయల రొక్కము—నీకుఁ బెట్టిన వేయిరూపాయల నగలు—ఏ గంగలోఁ గలిసినవి ?

నటి—మీ రొమ్ములు మీకుఁ దెలుగ నిచ్చివేసిన నాకు పిడియాకు లిచ్చెదరా ?

సూత్ర—ఆసి నీబొడ్డుపొక్క! యిది అమెరికాదేశ మనుకొంటివా రేమి! కాదుకాదు— ఆర్యావర్తము. అబ్బో! ఆ యాట లిక్కడ సాగవు! బొందు మెడఁగట్టినచో, బొందిలోఁ బ్రాణ ముండువఱకును బందెగొడ్డువలెఁ బడి యుండవలసినదే.

నటి—అట్లయిన నాసంగతి రేపాఁడంగుల సభలో నాలోచించెదను కాని— యిప్పుడు నన్నుఁ బిలిచినపని యేమో సెలవిండు.

సూత్ర—పాత్రములను సిద్ధపఱచితివా?

నటి—సిద్ధపఱచుటయే గాదు— శీఘ్రముగఁ బ్రవేశింపవలసిన దని చెప్పికూడ వచ్చినాను.

సూత్ర—అట్లయిన, వారింక నాలసించుచున్నా రేమి?

నటి—మీ చెవులలోఁ జెట్లు మొలచినవా యేమి! ఆచరకాగానము వినబడుట లేదా?

తెరలో—చరకా ప్రభావం బెవ్వరి కెఱుక! జగతిలోన మన చరకా.

సిరులతోడఁ దులదూగుచున్న యల

సీమజాతి చూచుచున్న దేమఱక చరకా.

సూత్ర—ఔనే! అవిగో—భ్రమరాంబా, కాళిందీ, కమలా పాత్రములు చరకాగానముతోఁ బ్రవేశించుచున్నవి. మనము పోయి పయిపని చూతము రమ్ము. (ఇద్దరు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

———



# పరవిక్రయము.

## ప్రథమాంకము

ప్రదేశము : పురుషోత్తమరావుగారి లోపలి చావడి.

ప్రవేశము; పంటెలను నూలు చుట్టుచు భ్రమరాంబ, చరకా గానముతో నూలు వడకుచు కాళిందీ, భీమల.

కాళిం—భీమ — మోహన రాగము—ఆదితాళము.

చరకా పరిభాసం బెవ్వరి కేలుకే! జగతిలోన మన చరకా.
సిరులతోడఁ దులఁదూఁగుచున్న యల—
సీమజాతి చూచుచున్న దేమిక. చరకా.

పాలుప కిరువదికోట్ల రూప్యములు | సంపాదించెను. వారికే గాక
మేలి చేతిపనులు మాపుకొని | మేటి బానిసలమైన వెనుక. చరకా.
పాటవమగు సామ్రాజ్యముఁ గూర్చున్ | పరిమితి లేని ధనంబును
జేర్చున్ | కాటక రాకాసిని బరిమార్చున్ | సాటిలేని యొక జాతి
నొనర్చున్. చర.

కాళి——అమ్మో! అదేమే——చేతిలోని నూలు చేతిలోనే యున్నది!

భీమ——ఈపూట నాదృష్టి యీపనిమీఁద లేదే! మా నాయన గారు మిల్లెగరిస్తుండు కాఫీనీళ్లు గొంతులోఁబోసికొని, పొద్దున

బోయినపోక—యింతవఱ కింటికి రాలేదు! పండ్రెండు కొట్టు పావుగంట యైనది! ఎక్కడికి వెళ్లినారో యేమి పనిమీఁద నున్నారో తెలియదు!

కమ—నాయనగారి కిప్పు డిం కేమిపని యున్నది?— అహర్నిశలు అల్లురను వెదకుటకింద సరిపడుచున్నవి.

భ్రమ—అమ్మా! యేమి చేయు మనెదవు—ఆఁడుపిల్లలం గన్నవార యవస్థ యిప్పు డీస్థితికి వచ్చినది!

గీ. కన్య నొక్కరి కొసఁగి స ♦ ద్గతులు గాంచు
మనుచు సంతోషపడు కాల ♦ మంతరించి,
కట్నములు పోయఁ జాలక, ♦ కన్య నేల
కంటిమా యని వ్యధపడు కాల ♦ మొదవె!

కమ—అట్లు కాని ఆఁడుబిడ్డలతల్లి వ్యధకుమాత్రము అర్థములేదమ్మా ఏ మందువా?

గీ. కార్య మగుదాఁక వయ్యయో! ♦ కాకపోయె
ననుచుఁ దపియించు రేపవ ♦ లాత్మ్మలోస;
కార్యమగునంత బిడ్డ నె ♦ క్కరణి విడిచి
యుండనోపుదు నని దిగు ♦ లొందు మదిని.

కాళి—హుష్! ఊరకుండుము! అదిగో చెప్పుల చప్పుడు— నాయన గారు వచ్చుచున్నారు?

పురు—(ఆయాసముతోఁ బ్రవేశించి) ఔరా! యేమి విపరీతకాల మాసన్న మైనది.

మ. చెడె ధర్మంబు నశించెసీతి! హరియిం ♦ చెం బూర్వమర్యాద! లం
గడిఁ గూరాకు విధాన, వేలమునఁ జొ ♦ క్కా టోపీ పాగాల కై!
వడి, సంతం బశువట్లు- పెండ్లికొడుకున్ ♦ వ్యాపార మార్గంబునం
బడయంగావలె దవ్యముం గురిసి పై ♦ పం పైస నేఁ డిమ్మహిన్.
ఇంతకన్న ఘోర మింకేమున్నది.

మ. పనిలే దంట కులంబుతోఁ, జదువు సం ♦ పజ్ఞాన సంపత్తితోఁ!
బనిలే దంట ప్రతిష్ఠతోఁ, బసవుతోఁ, ♦ బంధుప్రమేయంబుతోఁ!
గనకంబున్, మృదులాంబరంబులును, నే ♦ ల్కాంబున్ సమర్పించి, లాం
ఛనముల్ దండిగ ముట్టఁజెప్పినటె యవ ♦ శ్యం బంట సంబంధికిన్!

(అని యనుకొనుచు ముందునకు నడచును)

**భ్రమ**—(లేచి) ఇదేమి నేఁ డింత సేఁ పున్నారు! భోజనమునకుఁ బ్రొద్దు పో లేదా?

**పురు**—వెట్టిదానా! యెక్కడి భోజనము!—ఎక్కడి లోకము!

సీ. కంటను బడు మశ ♦ కంబు చందంబున
నరములపై లేచు ♦ కురుపు పోల్కి
తద్దయుఁ గదిలిన ♦ దంతంబు చాట్పున
మారువాడీ యప్పు ♦ మాదిరిగను
పలుసందునం జిక్కు ♦ పడిన పీచు విధాన
బెట్టు చెప్పులలోని ♦ బెడ్డ పగిది
కుత్తుకం బడు నాకు ♦ కుట్టుపుల్లం బలె
పుట్టంటుఁ జొచ్చిన ♦ పూతిక గతి
ప్రతినిమేషము బిడ్డల ♦ పరిణయంపుఁ
జింత వేధించునపు డన్య ♦ చింత యేడ!
యీడువచ్చిన కన్నియ ♦ లింటఁ గలుగు
తండ్రి దురవస్థ తెలియును ♦ దైవమునకె!

**భ్రమ**—ఇంతకు నిప్పుడు చేసికొనివచ్చిన పని యేమిటి?

**పురు**—కాళ్ళరుగునట్లు కాలేజి యంతయుఁ గలయఁ దిరుగుటకంటెఁ జేసినపని చిన్న మెత్తు లేదు!

**భ్రమ**—కాలేజి యంతటిలోఁ బెండ్లికావలసిన పిల్లకాయ లెవ్వరును గానుపింపనే లేదా?

సిగరెట్లు, బీడీలు, ♦ చెక్కుట ఖిల్లీలు
లేనివాఁడు ధరిత్రి ♦ లేనివాఁడు
చలువ యద్దములు, పై ♦ కిలుకట్టు పెడగోచి
లేనివాడు ధరిత్రి ♦ లేనివాఁడు
తనదు తలమించినట్టి వృ ♦ ధావ్యయంబు
లేనివాఁడు ధరిత్రి ♦ లేనివాఁడు
ఇట్టు లున్నారు విద్యార్థు ♦ లిప్పు డక్క-
డక్క డొకరిద్ద ఱెవ్వరో ♦ దక్కసుదతి!

ప్రథమ—వారి తలిదండ్రు లీపాటికి వారిచేత చదువులకు స్వస్తి యేల చెప్పింపరో!

పురు—వెఱ్ఱిదానా! ప్రస్తుతము చాలమంది బాలురను పాఠశాలల కంపుట- విరివిగా గట్నములు లాగుటకుగాని విద్యకొఱకుఁ గాదు. అందువలన మనువు కుదిరిన మఱునాడు కాని మాని పింపఁ దలంపరు.

ప్రథమ—అట్లయిన నాచూపుడుగుఱ్ఱములతో మన కవసరములేదు. గాని— మీతోపాటు సంఘసంస్కరణముకొఱకు సన్నద్ధులైన వా రెందఱో కలరు గదా— వారిలో నెవ్వరికిని వయసువచ్చిన పిల్లకాయలు లేరా?

పురు—లేకేమీ— యున్నారు. ఉండి యేమిలాభము- ఉపన్యాస వేదికపై నుక్కిరిబిక్కిరి చేసుకొనుటయే కాని— పని వచ్చి నప్పుడు పట్టుదల సున్న! బాల్యవివాహము లన్నఁ బట బట పండ్లు కొఱకు బాపిరాజుగా రేమిచేసినారో విన్నావా!— అభము శుభము నెఱుఁగని యాతేండ్లపిల్లను, నలుబదియేండ్లు కడచిన నాలుగవ పెండ్లివానికి ముడిపెట్టి— అదేమన— అత్తగారి పట్టన్నారు? స్త్రీపునర్వివాహములకొఱకుఁ జిందులు త్రొక్కిన శివయ్యగారు బంగారు బొమ్మవంటి పదునాఱేండ్ల

చెల్లెలికి భర్త చావఁగానే, వంటలక్కను మానిపించి, సంత
తప్పెల చేతికిచ్చి- అదేమన—మాయమ్మ చావనిమ్మన్నారు.
శవవహనమునుగూర్చి శంఖములు పూరించు శరభయ్యగారు—
ప్రక్కయింటి ఇల్లాలు భర్త చచ్చి, శవవాహకులకు దక్షిణిచ్చు
శక్తిలేక దేవుఁడా గోడా యని దేవులాడుచుండ వీధితలుపునకు
గొండ్లెము వైచి, విస్తైడు నైవేద్యముపట్టి, పెరటిత్రోవను
పేకాటకుఁ జక్కఁబోయి— అదేమన ఆమె వచ్చి అడుగనే
దన్నారు! విన్నావా?— వీరే కాదు— ఈయూరి సంఘ
సంస్కర్తలందఱు నిదేమాదిరి!

భ్రమ—అయిన నొకసారి యాలాపించి చూడకపోయినారా?

పురు—ఆహా— ఆ యాశకూడఁ దీర్చుకొనియే వచ్చినాను. ఎవరితోఁ
ప్రస్తావించిన నొక్కటియే పల్లవి—"నాకిష్టమే కాని మావాళ్లు
పడనివ్వరండి" 'యను మాట తప్ప మాఱుమాట లేదు!

భ్రమ—వారన్నదియు వాస్తవమే. కట్నము లేదన్న నాఁడుది కంఠ
మున కురిపెట్టుకొను దినములు వచ్చి—మాట దక్కుట
కవకాశము లేనప్పుడు, మాబాగని తలయూఁప వలసినవారే
కాని— మగవారుమాత్ర మేమి చేయఁగలరు!

పురు—అదేమన్నమాట'—ఆఁడుదానిమాట కింత యడుగుదాఁటలేని
యధములు దేశారాధన మేమి చేయగలరు?

సీ. చదువులు మాని స్వేచ్ఛగ దేశభటకులై
నట్టివారికి లేరె ♦ యీఁడువారు
రాచతీవ్రుల నెట్టి, ♦ రాట్నముల్ చేఁపట్టి
నట్టివారికి లేరె ♦ గోఁడువారు
వృత్తులు రోసి. ♦ సంపత్తు లర్పణచేసి
నట్టివారికి లేరె ♦ [illegible]

భోగముల్ వీడి, కారాగారముల మాడి
నట్టివారికి లేరె యేడువారు
కొంచ జీరీతి పంచలై, గోడుమాలి,
మగతనము చంపుకొని, తమ మగువల కెదు
రాడ నేరక—వార లే మనిన శిరము
లూచుచుం, గుక్కలై పడి యుండ్రు గాని !

ప్రథమ—చివర కేమి సిద్ధాంతపఱిచినాఁడు ?

పురు—అదే పాలుపోవుటలేదు. దారిలో దైవికముగా పెండ్లిండ్ల పేరయ్య యెదురుపడ— మాయింటి కొకసారి రమ్మని మఱి మఱి చెప్పినమాత్రం వచ్చినాను.

ప్రథమ—పెండ్లిండ్ల పేరయ్య యెవరు ?

పురు—ఎవరా!—పెండ్లిండ్ల పేరయ్య యనియు వివాహాల పేరయ్య యనియు నీయూరిలో నిరువురు బ్రాహ్మణులు. ఈ చుట్టుపట్ల నేవివాహము జరిగినను వీరి చేతులమీఁద జరుగవలెను.

ప్రథమ—సరిసరి తెలిసినది, చక్కనిపని చేసినారు. ఆయనతో నాలోచించి, అతిశీఘ్రముగాఁ గార్యములగు సాధనము చూడుఁడు. పెద్దమ్మాయికిఁ బదుమూఁడవయేఁడు కూడ వెళ్లవచ్చినది. చిన్నమ్మాయి దానికన్న నొక యేఁడాదిమాత్రమే చిన్నది. కట్నముల పట్టుదలచేత నిప్పటికే కాలహరణ మైనది. ఈ మాఘములో నిరువురకును ముడి పడకున్నచో ముప్పు వాటిల్లక మానదు. ఏ యెండ కా గొడుగు పట్టక తప్పదని నే నెంత మొత్తుకొన్నను వినిపించుకొన్నారు కారు. ఈపాటిమార్పు మీమనస్సున కిడివఱకుఁ గలిగినచో అల్లునితో నీపాటికి హాయిగా నుండెడివారము !

పురు—వెఱ్ఱిదానా! అల్లు రనెదవేమి! అల్లురు కారు— అధికారులు!
కావుననే- ఆఁడుబిడ్డలం గన్న యపరాధముక్రింద - పొగదీసి
సంచులకొలఁది జరిమానాలు వసూలు చేయుచున్నారు?
కాకున్న — కాళ్లుకడిగి కన్యనిచ్చువారికీ కట్నముల దండన
యెందులకు?

గీ. అప్పనంగినవాఁడును, అల్లుఁ, డద్ది
యింటి యజమానుఁడును, జీత మిచ్చువాఁడు,
కులవినోదియు, పన్నులు కూర్చువాఁడుఁ
బున్తె కట్టని మగలె పో పూరుషులకు!

అందును. నల్లురబాధ యనుభవించినవారికిగాని తెలియదు!

సీ. ముడుపులు పూర్తిగా ముట్టుదాఁకను బుస్తె
ముట్టక చేతులు ముడిచికొనును
తరువాతఁ బా న్పెక్కి దాఁచఁ బెట్టినయట్లు
జిలుగు కోరికలకు సిద్ధపడును
అవల గర్భాధాన మనినంతనే బిఱ్ఱబి
గిసి లంచం బటఁ బెట్టు మనును
అవిగాక పండుగు లరుదెంచినపు డెల్ల
తండ్రితద్దినము చందాన దిగును
మన్నియుం బుచ్చుకొని, యెన్నఁ డేని పిల్ల
నంపుమని ప్రార్థన మొనర్ప నదిరిపడును;
ఆఁడుపడుచుల, నల్లుర, నాటకత్తె
యల సెవం డేని తనియింపఁ గలఁడె వసుధ

పెనిమిటి మాట లేల;

అ ప్పడినవాని, నధికారి నధిశయించి
యల్లు రొందించు బాధల నెల్లఁ గాంచి,

అడలి, నిజముగ హరిహరు ♦ లంతవారు
కూఁతులం గంటయే మాను ♦ కొన్న వారు.

భ్రమ—మరల వెనుకటిదారిని బడి మనసు పాడు చేసికొనుచున్నారు.
అమ్మయ్యో! ఇదిగో ఒంటిగంట! రండుస్నానమునకు రండు.

పురు—స్నానము క్షణములో ముగించెదను. వడ్డన కాని మ్మని వంట
లక్కతోఁ జెప్పుము. పెద్దమ్మాయి! పేరయ్య వచ్చినచోఁ
గూర్చుండు మను. (అని భ్రమరాంబతో లోని కేగును)

కాళిం—చెల్లీ! మనవారి మాట లన్నియు వింటివికదా- నిజముగా
నీకేమి తోఁచుచున్న దే?

కమ—(చివాలున లేచి) చెప్పుమనెదవా?

గీ. తండ్రులకుఁ గన్న బాధయుఁ; ♦ దల్లులకు వి
యోగ బాధయుఁ దమకు నిం ♦ కొకరి యింటి
దాస్యబాధయుఁ గల దరి ♦ ద్రింపు టాఁడు
పుట్టువే పుట్టరా దని ♦ బుద్ధి నెంతు.

కాళిం—(లేచి కౌఁగిలించుకొని) బళి బళి! బాగుగాఁ జెప్పితివే!

ఉ. కట్ట! గృహంబు లమ్ముకొని ♦ కట్నమునీయక పెండ్లికాని యా
కట్టడి వక్రకాలమునఁ ♦ గాసలమధ్యమునందుఁ బుట్టగాఁ
బుట్టఁగఁ జెల్లుఁ గాని యొక ♦ భూపతి కేనియు నాఁడుబిడ్డగాఁ
బుట్టఁగ రాదు! పుట్టునెడఁ ♦ బుట్టినయప్పుడె గిట్టఁగాఁదగున్.

కమ— అక్కా! ఒక్కసందేహము.

గీ. వెండినాణెంబె పెనిమిటి ♦ వేశ్య; కటులె
కట్నములె భార్య లిప్పటి ♦ కర్కశులకు;
వేశ్య వెలయాలనంబడె ♦ వెల గ్రహించి,
కట్నములచేత వెలమగల్ ♦ కారెవీరు?

కాళిం— కాకేమి కాని మన మిప్పుడు కావింపఁదగిన దేమియు లేదా?

కమ—లేకేమి?

చ. తనువు లశాశ్వతంబులు గ ♦ దా? క్షణభంగుర జీవితార్థమై
ధన మిడి, భర్తలం బడసి ♦ దాస్య మొనర్చుటకంటె; పెండ్లియే
యనువుగ మానిపించుకొని, ♦ హాయిగ రాట్నముత్రిప్పుకొంచు యో
గినులగతి న్మెలంగిన సు ♦ ఖింపమొ? తీఱదె తండ్రి దీక్షయున్.

కాళిం— సెబాసనే చెల్లీ! వయసునకుఁ జిన్నదానవైనను వరహాల కెత్తుకెత్తయిన మాట్లాడితివి! ఇదిగో.

గీ. నాదు ప్రతినంబు వినుము ♦ ప్రాణముల నైన
విడిచెదం గాని, యడిగిన ♦ విత్త మిచ్చి
వరుని గొని తెచ్చినట్టి వి ♦ వాహమునకు
సమ్మతింప నారాట్నము ♦ సాక్షిగాను.

కమ—హుష్! ఊరకుండు యెవరో వచ్చుచున్నారు.

పేర—(ప్రవేశించి) అమ్మా! పంతులుగా రేం చేస్తున్నారు?

కాళిం—మీ పేరు?

పేర— నా పేరా? నా పే రొకవిధంగా నడచి చచ్చిందా? చిన్నప్పుడు పేరడనీ, పేరిగాడనీ, అనేవారు. కాస్త ముదిరినతర్వాత, పేరన్ననీ, పేరయ్యనీ, అంటూవచ్చేవారు. ఇప్పుడిప్పుడు పేరశాస్త్రుల్లనీ, పేరి భొట్లనీ, పేరావధాన్లనీ, పేరిచైన్లనీ అంటున్నారు. ఇకముందే మంటారో యీశ్వరుడికి తెలియాలి.

కాళిం—నాయనగారు భోజనము చేయుచున్నారు. అదిగో ఆకుర్చీపై గూరుచుండుడు.

పేర— (కూర్చుండి) అయ్యో నాయిల్లు బంగారము కానూ! అప్పటినుంచి యిప్పటిదాకా భోజన మేనా! బజార్లో పంతులుగారికి కనిపించినతర్వాత, పండా కొండయ్య యింట్లో బారసాల సంభావన పుచ్చుకుని, వీసెడు వంకాయలూ విస్తళ్ళూ కొని

కన్నాని, యిద్దరితో మాట్లాడి యింటికిపోయి, స్నానం జేసి సం
ధ్యావందనం చేసుకుని, జపంచేసుకుని, దేవతార్చన చేసుకుని!
భోజనంచేసి, పొడుం చేసుకుని, కాస్త మంచికకువం కంటబడే
వరకూ గడపలో నుంచుని, అయిసరబొజ్జా అని అప్పుడు చక్కా
వచ్చాను. అయితే, అమ్మా! మీ రిద్దరూ, పురుషోత్తమరావు
పంతులుగారి పుత్రికలనుకుంటాను, అంతేనా? ఆఁ! అదుగో!
ఆ పోలికలే చెప్తున్నాయి! అయితే, మీ పేర్లేమమ్మా!

కాళిం—నా పేరు కాళింది, మా చెల్లి పేరు కమల.

పేర—ఏం చదువుకుంటున్నారు?

కమ—ఇదివఱ కింగ్లీషు, తెలుఁగు చదివెడువారము. ఇప్పుడు హిందీ,
సంస్కృతనుఁ చదువుచున్నాము.

పేర—ఓయబ్బో! నాయిల్లు బంగారమైతే, నాలుగుభాషలే!
అయితే, ఆరుమోయన మేమయినా వాయిస్తారా?

కమ—(నవ్వి) హార్మోనియము కావలయును! ఆఁ వాయించగలము.

పేర—అల్లికా, కుట్టూ- యి వేమయినా చేతవునా? ఇదుగో!
యీబ్రాహ్మ డేమిటి యిన్ని ప్రశ్న లడుగుతున్నా డనుకుంటా
రేమో, ఈరోజులలో పెళ్లికొమార్తెలకు కావలసిన లక్షణా
లివ్వే. అందుకోసం అడుగుతున్నాను. అరుగో పంతులుగారు
వస్తున్నారు. చిటికెడుపొడుం పీల్చుకుని సిద్ధంగా వుంటాను.
(అని యట్లు చేయును.)

పురు—(ప్రవేశించి) ఏమీ! పేరయ్యగా రెండలోనే వచ్చినారే,
రనంతసేవు పండుకొని కాని రారనుకొన్నాను. (అనుచు నిం
కొక కుర్చీలోఁ గూరుచుండును.)

పేర—సరి సరి. యెంతమాట! తమ సెలవైనాక, తక్షణం చేతులు
కట్టుకుని వచ్చి నాల్గాను గాని, నిదరపోతానా!

పురు—అమ్మాయిలను జూచినారు గదా? వీరికే యిప్పుడు వివాహములు కావలసియున్నది. అమ్మా! మీరిక భోజనమునకు వెళ్ళి మీ యమ్మ నొకసారి యిటు పంపుడు

కాళిం—కమ—(లేచి నిష్క్రమింతురు.)

పేర—తమ గోత్రమేమిటి?

పురు—కౌశిక గోత్రము.

భ్రమ—(ప్రవేశించును.)

పురు—ఇదుగో! యీయనయే పేరయ్యగారు. పాపము, నా మాట మీద పడకకూడ మాని చక్కవచ్చినారు.

భ్రమ—సంబంధము లెవ్వియైన సానుకూలపడు నన్నారా?

పేర—అమ్మా! సంబంధాల కేమి లోటు? కో! అంటే కోటి సంబంధాలు! అయితేసరా, వేలుపెట్టి చూపడానికి వెల్తి లేని సంబంధం సందర్భపడాలి. ఏం బాబూ! ఏమంటారు.

పురు—అంతే కాని, అసలుగంటి మీతో చెప్ప లేను. నేను వర శుల్కము దూష్యమనే వాదములోని వాడను. ఈ దురాచారము మానిపింపవలెనని, యిప్పటికి బదేండ్లనుండి పాటు పడుచున్న వాడను. ఈ కారణములచేత నీపిల్లలకు గట్న మిచ్చి పెండ్లి సేయుట కిష్టము లేక...

పేర—తెలిసింది, తెలిసింది- అక్కడికి కాగి, ఒక్క మాటకు సమాధానంచెప్పండి? పదేళ్ళనుంచి పాటుపడుతున్నారు గదా? యిప్పటి కొక్కరిచేత నయినా మానిపించ గలిగారా? వట్టిది బాబూ! వట్టిది? మచ్చుకైనా మానేవా రుండరు. వేలెడు కుఱ్ఱవాడు కనబడితే వేలకు వేలు వేలం పాడేటప్పుడు, వెఱ్ఱి, పిచ్చి, మానడానికి. ఇంతయెందుకూ? ఇదివఱకు కోర్టులో, ఇంత ఇన్‌కమ్‌టాక్సు ఇస్తున్నా మంటే ఘరానా, ఇప్పుడో— మాఅబ్బాయి కింతకట్న మయిచ్చారంటే ఘరానా!

ఈలాటిస్థితిలో ఎవరు మాన్తారు! వద్దు బాబూ వద్దు! ఈపిచ్చి మాత్రం యిక విడిచిపెట్టండి! అమలాపురంలో, వెనక, అయ్యాగారి అంబయ్యగారి పిల్లాగె, కట్న మివ్వనని భీష్మించికూర్చుండే సరికి కన్య సమర్తాడి పూరుకుంది! ఆపాటున, నలుగురూ అంతు చెయ్యడం ఆబ్రాహ్మ డాపిల్లతో బ్రహ్మసమాదిగాడి కంటగట్టడం ఆపిల్ల కాపరానికి వెళ్లి అయిదుగురు బిడ్డలను కనడం యిన్ని జరిగాయి!

పురు—అట్లయినం, కట్నములేని సంబంధము కన్నోడుచుకున్నను లభింపదన్న మాటయేనా?

పేర—లక్షయేళ్ళు తపస్సు చేసినా లభించదు. ఎవరైనా తేగలిగితే కుండనాలు పెట్టుకుందామని కుట్లు పెంచుకుంటూవున్న నా చెవులు కుదుళ్ళలోకి తెగ్గోయించుకు పోతాను! ఇంతెందుకూ పెద్దపెద్ద లిప్పుడు బేరాలతో పనిలేకుండా. బల్లమీద రేట్లు వ్రాయించి, బయట తగిలిస్తున్నారు! వెలగలేటివారు వేయిన్నూట పదహార్లు, రేటూరివారు రెండువేలు, ముంజులూరివారు మూడువేలు, నందిరాజువారు నాలుగు వేలు, అయ్యంకివారు అయిదు వేలు, చింతలూరివారి చిన్నవాడు తూగినన్ని రూపాయిలు ఎవరిమట్టుకువారీవిధంగా యేర్పాట్లు చేసుకుని కూర్చున్నారు. ముందుముందు చీట్లమీద రేట్లు వ్రాసి షాపులలో వస్తువుల కంటించినట్లు పెళ్ళికుమాళ్ళ ముఖాలకు అంటిస్తారనికూడా అనుకుంటాను!

పురు—రామరామా! రానురాను దేశ మేస్థితిలోనికి వచ్చినది!

పేర—అయ్యా! మీరు దీనికే ఆశ్చర్యపడుతున్నారు. కట్నాల తమాషా కమ్మవారిలో చూడాలి! వారిలో నల్లబంగారమే కాని తెల్లరూపాయలు పనికిరావు. ఆ నల్లబంగారంకూడా యికరాలలెక్కపోయి పుట్లలెక్కలోనికి దిగింది. పదిపుట్ల

భూమికి వచ్చినవాడు పనికిమాలినవాడే? ఈమధ్య నో యీతాత మొద్దుకు ఇద్దరు భార్యలుండగా ఇరవైపుట్ల భూమితో ఇంకో పిల్లను కట్టబెట్టారు! నాలుగురోజులకిందట నలభయ్యారేళ్ళ నలుగురుబిడ్డల నాలుగోపెళ్ళి పెళ్ళికొడుకుకు నలభైపుట్ల యీనాంభూమీ, నలభై వెయ్యి నూటపదహార్ల రొక్కమూ, నలభైతులాల గోపతాడూ, నాలుగుతులాల చుట్లూ, నాలుగు ఇతల యెడ్లూ, రెండు బళ్ళూ, నన్నవందలగజాల పాటిమన్నూ, ముష్టాయిబళ్ళ ముక్కిన పెంటా, సమర్పిస్తా వియ్యపురాలి కాలు పాడిగేదెలూ, వియ్యంకుడికి కైదుబళ్ళ గోనునారా యిస్తే పుస్తె ముడేశాడు! విన్నారా?

గీ. బ్రాహ్మణులయింటఁ దొలుఁదొల్తఁ ♦ బ్రభవమొంది
కోమటింటను ముద్దులు ♦ గొనుచుఁ బెరిగి,
కమ్మవారింట పెళ్ళినఁ ♦ గాఁపురంబు
సేయుచున్నది కట్నంపుఁ ♦ జేడె నేఁడు.

భ్రమ.—సరి కాని సంబంధము లేమున్నవో చెప్పినారు కారు.

పేర—చెపుతానమ్మా! చెపుతా, ఇద్దరికీ యీసంవత్సరమే చేయదల చుకున్నారా?

భ్రమ—సంబంధము లమరినచో నిరువురకు నీ సంవత్సరమే చేయవలె నని యున్నది. అయినఁ గాళిందిమాట ముందాలోచింపుఁడు.

పేర—అలాగైతే, సంబంధాల విషయంలో మీ యభిప్రాయమేమిటో సంగ్రహంగా ముందు సెలవివ్వండి. మీకు కావలసింది: చదువా? చక్కదనమా? సంపత్తా? సంప్రదాయమా? లేక; చదువూ సంప్రదాయమూ, సంప్రదాయమూ సంపత్తూ, సంపత్తూ చక్కదనమూ, చక్కదనమూ చదువూ, చదువూ సంపత్తూ, ఈవిధంగా వుండవలెనా?

పురు—నాకేమో చదువు, సంప్రదాయము వీనిపై నున్నది. దాని కేమో చక్కదనము, సంపత్తు వీనిపై నున్నది. మీరు వూ యుభయుల కోరికలు తీరునట్లు చూడవలెను.

పేర—అంటే నాలుగూ వున్న వాడు కావాలన్న మాట. కాని, నాలుగూవున్న వాణ్ణి నేనుగాదు సరిగదా నన్ను పుట్టించిన బ్రహ్మదేవుడుకూడా తేలేడు! ఏమంటారా? వారాలు చేసు కున్న వాజెమ్మకుగాని చదు వబ్బదు; పగువాళ్లని నీనాసికి కాని భాగ్యం పట్టదు! ఇట్టస్థితిలో, నాలుగూవున్న వాణ్ణి తేవ డానికి నాతరమా నాయబ్బతరమా.

భీమ—అట్లయినచో, నేటిస్థితినిబట్టి, నేను గోరినవే ముఖ్యముగాఁ జూడ దగినవి. ఏమనెదరా? బియ్యే ప్యాసయినవా రుద్యోగ ములు లేక, పిల్లదగుగుమాస్తాపని కోసము పిచ్చెత్తినట్లు తిరుగు చున్నారు! పిల్లల్లబోటీలేక, పీనుఁగు వంకాయల ఫీజునకు విలేజికోర్టులకు సిద్ధపడుచున్నారు! చదువులసంగతి యీ సర ణిగా నున్నది. ఇఁక సంప్రదాయముసంగతి చూచినచో అయినకుటుంబము లడుగునఁ బడినవి. కాని కుటుంబములు గణ నకు వచ్చినవి! ఇంతయేల! నిత్యము మనము చూచు నిర్భాగ్యు లలోఁ జాలమంది సంప్రదాయ కుటుంబములలో జన్మించిన వారే! ఏమిలాభము సంపత్తు లేని కులీనుఁడు స్మశానములోని తులసిమొక్క వంటివాఁడు! కాఁబట్టి, యీ దినములలో నింత కలిగిన సంబంధమే యాలోచింపఁదగును.

పేర—అమ్మా! మీమాటలు నాకు అరటిపం డొలిచి చేతిలో పెట్టినట్లున్నాయి. కాని కలిగినవారికోసంచూస్తే కట్నం కాస్త హెచ్చు కాకమానదే? నిన్నగాక మొన్న, నీళ్ళకావిళ్ళ నీళ్లకంఠంగాడి కొడుకుకు వెయ్యినూటపదహార్లు రొక్కం

వెండి కంచం, వెండి చెంబు, బంగారంభటువు, పట్టుతాబితా రిష్టువాచీ, సిగరెట్ల కేసూ · ఇంకాయేమేమిటో వాటి పేర్లు నాకు తిన్నగా రావు. బ్యాట్లట, సెల్ఫు షేవింగు రేజరట, పాకెట్టు టాయిలెట్టు బాక్సట, వ్యాసలైను సీసా అట; వల్లకాడట యిస్తే పుస్తె ముడేశాడు. గొప్పవారిమాట చెప్పవలసిం దేముంది?

భ్రమ—సరే కానిండు సమయమునుబట్టి నడువక తప్పునా?

పేర—అయితే యిం కేమీ! ఆపాటి ధైర్యమిచ్చారంటే కొండమీది కోతిని తేగలను. ఇదుగో యిప్పుడు చెపుతాను వినండి. మంత్రి ప్రగడ మాధవరావుగారి పిల్లవాడికి మాన్యాలమీద రెండు వేలు వస్తాయి మాటాడమంటారా?

భ్రమ—ఆపిల్లవానిది అడ్డతలండీ!

పేర—అయితే పోనివ్వండి. పచ్చమట్ల బాపిరాజుగారి పిల్లవాడికి పన్నెండువందలు వస్తాయి ప్రేమరీ పేసయ్యాడు కుదర్చనా?

భ్రమ—రంగు?

పేర— రంగుకేమీ రాజారంగు. అంత యెరుపూ కాదు. అంత నలుపూ కాదు, చక్కని చామంచాయ.

భ్రమ— చామనచాయ యిప్పటివారికి సరిపడుటలేదండీ;

పేర— ఆలాగయితే, నాదెళ్ళ వారి పిల్లవాడు మీ నాడాని కాగు తాడు. పచ్చగా పనసపండు. నలుగురన్నదమ్ములు. నలుగురకూ నాలుగ్గైదువందలు రెండు వేలువస్తాయి.

భ్రమ— అబ్బే! అయిదువంద లీదినములలో నొక యాదాయమా?

పేర— అయితే, ముంజులూరి ముత్తయ్యగారి దత్తపుత్రుడికి మూడు వేలు వస్తాయి. ముఖం చంద్రబింబాన్ని మించివుంటుంది.

భ్రమ—అవునుగాని అతడు మాపిల్లలకంటె ఆఱంగుళాలు పొట్టి!

పురు—ఓసీ నీ యెంచుబడి యేటఁ గలిసెనూ! యీవిధముగా నెంచుటకు మొదలుపెట్టినచో లోపము లేనివాఁడు లోకములో నుండునా?

పేర—బాబూ! యింకా యేంచూచారు! ఇతర్లతో పోల్చిచూస్తే యీ యమ్మ చాలా మెరుగు. ఒక్కొక్క యిల్లాలి సంగతిచూస్తే వొళ్లు మండిపోతుంది! సర్వవిధాలా నచ్చిన సంబంధమైనా వచ్చి యడిగినప్పుడు వంకలు పెట్టడం మించిపోయాక మిడకడం!

భ్రమ—అయ్యో! ఆఁడుపిల్లలకుఁ గావలసిన హంగులు మగవారి కేమి తెలియును? ఆడుబిడ్డ పెండ్లియన, మగవారికి అప్పు నేర్చుకొనుట యని యభిప్రాయము!

పేర—అవునమ్మా! అవును అవశ్యం ఆలోచించవలసిందే కాని మీ మాటలనుబట్టి, మీ మనస్సులో యేదో సంబంధం తగిలే వున్నట్టు తట్టుతోంది. ఆ ట్టి మమ్మల్ని చంపక, అదేమో చెప్పి తీరా బ్రతుకుతాం.

భ్రమ—(నవ్వి) చెప్పుమనెదరా? సింగరాజు లింగరాజుగారి దత్త పుత్రుఁడు, నా బుద్ధికి రవంత నచ్చినాఁడు.

పురు—ఆపిల్లవాఁ డాలోచింపఁ దగినవాఁడే. స్కూలుఫయినలు చదువుచున్నాఁడు, చూపరి, నడతకూడ నాఁడె మయినదేయని విన్నాను. కాని, రెండుసందేహము లున్నవి. మొదటిది: యేఁబదియవ పడిలో మూడవపెండ్లి చేసికొన్న మూఢునితో సంబంధము చేయనాయని. రెండవది: పిల్లవానికిఁ బదునాఱేం డ్లకు బయినుండవు. వరహీన మగునేమోయని.

పేర—మీ రెండుసందేహాలూ మినహాయించతగ్గవే. ఏమంటారా? దీవంపెట్టే దిక్కులేనప్పుడు ఏగడ్డి కరవక యేంచేస్తారు? ఇక వరహీనం మాటా? ఆపిల్లవాడికీ, మన పెద్దమ్మాయికీ ఒకటి కాదు రెండుకాదు మూడేళ్ళు తేడా! ఇంకా వరహీనమేమిటీ? కోమట్లలో యిప్పుడు కొంచెం పెద్దపిల్లలనుకూడా చేస్తున్నారు. అంతగా చాదస్తు లెవ్వరైనా వుంటే అబ్బాయి కధికమాసాలు చేర్చి, అమ్మాయికి తగ్గించి సరిపుచ్చుకొంటున్నారు. అందుకూ వప్పరనితోస్తే జాతకాలు పిరాయిస్తున్నారు. ఇన్నెందుకూ?

సీ. వయసుతోడను బనిలేదు ♦ వావితోడ
నంతకన్నను బనికల్గ ♦ దరయ నోళ్ల
రింటిపేరును, గోత్ర, మిం ♦ కేదియుఁ గూడ;
ఆస్తి యొక్కటియే యిష్ట ♦ దన్నిటికిని.

భ్రమ—అన్నట్లు మఱచినాను నారికిని నాకు మాటేంస్తే తేడా!

పేర—అవునుగద? యింకేమీ?

పురు—సరే, యిక నాసందేహములపూట విడిచిపెట్టి ఆసంబంధము పెద్దమ్మాయి కాలోచించండు.

పేర—ఆలోచించడానికి కభ్యంతరం సేమీలేదు. కాని లింగరాజుగారు మాత్రం లిక్కికి లక్కనే మరిచి కట్నండగ్గిర కంఠానికి ముడి వుంచదు. సరే, సర్వవిధాలా ప్రయత్నం చేతాము. అయితే అమ్మాయి లిద్దరికీ బాలతొడుగు లేపాటి వుంటాయి?

పురు—నేయేపి రూపాయలకు నెలితి యుండదు. అవిగాక వారి బారసాలలనాఁడు వారి మాతామహుఁడు వారికి వ్రాసియిచ్చిన పదేసియెకరముల భూములవల్లను నైదేసివందలు వచ్చుచున్నవి.

పేర—అలాగైతే యిఁక నంత భయపడవలసిన పనిలేదు. అమ్మగా రన్నట్లు పెద్దమ్మాయిసంగతి ముందు తేల్చుకుని, ఆవెనుక చిన్నమ్మాయిసంగతి ఆలోచింతాము. (అని లేచును)

పురు—మరల మీదర్శన మెప్పుడు?

పేర—రేపు దుర్ముహూర్తం పోగానే లింగరాజుగారి ఇంటికి వెళ్ళి, సంగతిసందర్భాలు చూచుకుని, సాయంకాలంలోగా వస్తాను.

భ్రమ—ఏమో. యేమిచేసికొనివచ్చెదరో పిల్లల వివాహభారము మీది. మిమ్ములను సంతోషపెట్టు భారము మాది!

పేర—అమ్మా! ఆమాట మీరు వేరే సెల విస్వాలా? కార్య మయిందాకా కన్నుమూస్తే ఇది గాయిత్రి గాదు? శెలవు!

తెర పడును

ఇది ప్రథమాంకము



# వరవిక్రయము

## ద్వితీయాంకము

ప్రవేశము: లింగరాజుగారి వ్యాపారపు గది.

లింగ—(ఆయాసముతోఁ బ్రవేశించి) ఇస్! అబ్బా!

చ. పిడుకలు, వంటకట్టెలును, ♦ బీటలు, పేటలు లెక్కఁజూచి, యే
ర్పడ, పొయిబొగ్గులం గొలచి, ♦ పాదుల కాయలనెంచి; దూడ పా
ల్విడిచినదాఁక నిల్వఁబడీ; ♦ వాకిటి కొబ్బరిచెట్ల కాయలన్
గడన మొనర్చి; యిప్పటికిఁ ♦ గా లిడఁ గల్గితి నింటిలోపలన్!

ఇఁక స్థిమితముగాఁ గూరుచుండి, యీపూఁటతోఁ గాలదోషము పట్టు కాగితము లేమయినఁ గలవేమో చూడవలెను. వాయిదా లయిన పత్రములకు వడ్డీలు పంపనివారికి వడఁకు పుట్టునట్లు నోటీసులు వ్రాయవలెను. ఈపూఁట కోర్టులో హీరింగు లేమున్నవో చూడవలెను. దేనిపట్ల రవంత యేమఱినను దెబ్బ తినక తప్పదు! పనివచ్చినచో ప్రాణములనైనఁ బోనీయఁ దగును గాని పయిస సొమ్ము పోనీయఁగూడదు! ప్రాణములో నేమున్నది? గాలి యేగా! పైక మట్టిదా! ప్రపంచమంతయు దానిలో నున్నది! కనుకనే, "ధనమూల మిదం జగ" త్తన్నారు.

సీ. కులలోప, గుణలోప ♦ ములు మాపుకొనుటకు
ధనము ప్రధాన సా ♦ ధనము నేఁడు
వర కట్నములకు, స ♦ భా కట్నములకును
ధనము ప్రధాన సా ♦ ధనము నేఁడు
మునిసిపల్, లోకలు ♦ బోర్డు యెన్నికలకు
ధనము ప్రధాన సా ♦ ధనము నేఁడు
మడులు మాన్యములుఁ గొం ♦ పలు నచ్చిపడుటకు
ధనము ప్రధాన సా ♦ ధనము నేఁడు
అట్టిధనమును దమ పాడు ♦ పొట్టకొఱకొ,
బట్టకొఱకొ, లంకపొగాకు ♦ చుట్టకొఱకొ,
వెనుక ముందులు చూడక ♦ వెచ్చపెట్టు
వారు నిజముగ మతిలేని ♦ వారు గారె!

భాగ్యము పెరుఁగుటకు బ్రిహ్మప్రజ్ఞలు కావలెను.

సీ. తలలు మాఱిచియొ, మూ ♦ టలు విప్పియో, కొల్ల
గొట్టియో సిరికూడఁ ♦ బెట్టవలయు
ఆస్తులనెల్ల భా ♦ ర్యలపేర వ్రాయించి
మాయ దివాలాలు ♦ తీయవలయు
వడ్డికి వడ్డి, యా ♦ వడ్డికిఁ బైవడ్డి
పెంచి గిజా యసి ♦ పించ వలయు
రాత్రులు మేల్కాని ♦ రామకీర్తనలను
పాడుచుఁ గొంపఁ గా ♦ పాడ వలయు
అప్పు గొన్నవారి ♦ యాస్తులెల్లను వచ్చి
పడెడుదనుక నిద్ర ♦ విడువ వలయు,
దొంగలెక్క లుంచి ♦ దొరలకంటను దుమ్ము
గొట్టి పన్ను మాన్ప ♦ కొనఁగవలయు.

పెక్కుమాటలేల——

సీ. పరువుఁ బ్రతిష్ఠయుఁ ♦ బాటింపఁగా రాదు
పొట్టకేనియుఁ గట్ట ♦ పెట్టరాదు
బంధువు చేతేరఁ ♦ బల్కరింపఁగ రాదు
వేఱువిస్తరి యింట ♦ వేయరాదు
కష్టజీవులఁ జూచి ♦ కటకట పడరాదు
త్రిప్పక తనయప్పు ♦ తీర్పరాదు
దార కేనియు పెట్టె ♦ తాళ మీయఁగరాదు
వేయికళ్లల కేని ♦ వెఱవరాదు
ఇన్ని విధములఁ గాపాడ ♦ నున్న ధనము-
దక్క నేఱదు; ధనము చేఁ ♦ దక్క నింటఁ
బెత్తనము లేదు! బయటను ♦ పేరు లేదు!
పలుకుబడి లేదు! బ్రతికిన ♦ ఫలము లేదు.

వెఱ్ఱివెంకటాయలు? పత్రిక లనియుఁ, బరిశోధన లనియుఁ సంఘ సంస్కరణము లనియు, సహాయ నిరాకరణము లనియు స్వారాజ్య మనియు, చట్టుబండ లనియు. పనిలేని గొడవలు పయిఁ బెట్టుకొందురు. కాని వడ్డీలు పెరుఁగుటకు వాటమైన సాధన మొక్కరును జూడరు?

కం. కలుపు పెరుఁగునట్లు; ♦ కంచెలుం బొదులు
పెరుగునట్లు, నాచు ♦ పెరుఁగునట్లు;
వడ్డి పెరిఁగెనేని ♦ వహ్వా! యదృష్టము
పండె ననఁగ ♦ నిండ్లు నిండిపోనె!

వాస్తవమునకు వడ్డికి సాటియైనది మఱి యున్నదా?

ఆ. నిజముకన్న కల్ల ♦ నిశ్చయంబుగఁ దీపి
బిడ్డకన్న ముండ ♦ బిడ్డ తీపి

కరము, వేతనంబు ♦ కన్న లంచము తీపి
వసుధ, మొదలుకన్న ♦ వడ్డి తీపి!

(అంతలో స్మృతి నభినయించి) అన్నన్నా! యెన్నడును లేని దీపూట ప్రాతఃకాల లక్ష్మీప్రార్థనముమాట పరాకు పడితిని గదా! (అని చెంపలు వైచుకొని, యినుపపెట్టెయెదుట నిలిచి చేతులు జోడించి)

దండకము. భగవతీ! భాగ్యలక్ష్మీ! ప్రణామంబు! నీదాస దాసాను దాసుండ, నీపాదభక్తుండ, నీదివ్యరూపంబె నిత్యంబు భావింతు, నీదివ్య నామంబె నిక్కంబుగా నిద్రలోఁగూడఁ జింతింతు; నాదిక్కు నా మ్రొక్కు నాయండ నాదండ నీవేసుమా! భార్యయుం, గీర్యయుం; బిడ్డలుం, గిడ్డలుం, దేవుఁడుం, గీవుడున్! మోక్షముం, గీక్షమున్, సర్వమున్నీవె! సత్యంబు! సత్యంబు నీకై నిరాహారినై యుందు, నీకై నిశల్ నిద్రమాన్కొందు నీకై శరీరాభిమానంబు వర్జింతు, నీకై యసత్యప్రమాణంబు లెన్నేని గావింతు నీయాన! ఈపెట్టెయే నీ పవిత్రాలయం; బేనె నీ యర్చకుండన్; యథార్థంబుగా నాదుప్రాణంబులే నీదు పూజాసుమంబుల్; శరీరంబె నైవేద్య కుంభంబు, నాయింట నేయుండి, నా పూజలం గొంచు నేయింటి కేఁగినం బోయి యూయిల్లు మట్టంబు గావించి నాయింటికిం దెచ్చి నాకిచ్చు చుండం గదే కన్నతల్లీ! నమస్తే! నమస్తే! నమః.

ఘంట—(ప్రవేశించి) బాబూ! పది కావచ్చింది. వంటసామా నిస్తారా!

లింగ—నీవంట వల్ల కాదుగాను! నీకింత తిండియావ యేమిరా! ధనుర్మాసము దప్పళమున కెవరైన పిలుత్తురేమో కాస్తంత నేను కనిపెట్టఁగూడదా?

ఘంట—సరే, మీాయిపం రాత్రి రిపట్టులు రానున్నట్టారా?

లింగ—అదిగో ఆమాటన్నావుసరి! (అని దసుకుపెట్టెదగ్గఱ కూచు
చుండి, పద్దులపుస్తకము పైకి దీసి) ఏదీ చెప్పు బియ్యమెన్ని?

ఘంట—మణిమెడు తక్కువ మానెడు.

లింగ—(వ్రాయుచు) వంటకట్టెలు?

ఘంట—మూడు.

లింగ—పిడకలు?

ఘంట—రెండు.

లింగ—నిప్పుపుల్లలు?

ఘంట—నిన్న మధ్యాహ్నం చీల్చిన పుల్లల్లో నిలవబావతు సగం.

లింగ—ఉప్పు?

ఘంట—వుద్ధరిణెడు.

లింగ—చింతపండు?

ఘంట—నిన్న మధ్యాహ్నం పులుసుకోసం పిసగ్గా నిలవవున్న తుక్కు.

లింగ—ఉల్లేమిచేసినావు?

ఘంట—వుంచా నీపూటకు.

లింగ—మిరపకాయలు?

ఘంట—మూడు.

లింగ—మాగాయ?

ఘంట—అమ్మగారికో ఒంకా అబ్బాయిగారికో ముక్కాను.

లింగ—గంజి.

ఘంట—గరిటెడు మీకూ అరగరిటెడు అబ్బాయిగారికి పోశాను.

లింగ—మిగిలింది?

ఘంట—చద్దన్నాల్లో సరిపెట్టాను.

లింగ—నీవో?

ఘంట—బజాట్లోంచి బంగాళాదుంపల కూర తెచ్చుకున్నాను.

లింగ— పడిచినట్లే యున్నది. కాని యెన్నడు నీలాటి వీనా నింటికిం గొనిరాకు! ఆవాసన తగిలి అబ్బాయికూడ పాడు కాంగలండు! తెలిసినదా? ఇదిగో కరివేపచెట్టుమీాంద కాకి గూడుపెట్టినది. యింతలో ఓ౦౦కెనతో దానిని బడ ద్రోసి యీపూంట పోయి లోనికి సిద్ధము చేసికో. కరివేపమండ ా లినచో కడుపు చీల్చె దనుసుమా!

ఘంట— రామరామా! పక్షిగూడు పడగొట్టడం పాపం కాదండీ?

లింగ— పాప మేమిటి నీబొంద! ఖరసంవత్సరములో మాయింటి వంటంతయు కాకిగూళ్ళతోనే వెళ్ళిపోయినది.

ఘంట— ఇదేమిటండీ! యింత ఘోరం మెక్కడా చూళ్ళేదు. ఇల్లాంటి పనులుమాత్రం యింకెప్పుడూ చెప్పకండేం. (నిష్క్రమించును)

లింగ— దరిద్రపుం గుంకలకు ధర్మపన్నములు మెందు! ఆవాజె పన్నెల వినసకట్టి యగుటంబట్టి వంటకుంకలను బెట్టుకొనక వల్లపడకున్నది. కుఱ్ఱవానికి వివాహమై, యాకుఱ్ఱది కాంపుర మునకు వచ్చువఱకు నీకుంక కుహ్వానన చెప్పుటకు వీలుపడదు.

బస— (ప్రవేశించి) నాన్నా అమ్మకు మొన్న బండి కట్టినవాండు అద్దె కొఱకు వచ్చి యఱచుచున్నాండు.

లింగ— ఇంటిలో లేరని చెప్పకపోతివా? బాబూ! పదునాల్గేండ్లు పయింబడినవి యిప్పటికైన నీకీపాటియూహా పుట్టలే దేమిరా?

బస— ఉండంగా లేరని చెప్పుటకూహా యెందులకు నాన్నా? అబద్ధ మాడం గూడదని మాటీచ ర్లనేక పర్యాయములు చెప్పినారు.

లింగ— మీాటీచర్లిట్టి మిట్టవేదాంతములు కూడం జెప్పుచున్నారుగా? సరే, యింకనేమి చదువుసంగతి చక్కగానే యున్నది!

బస— ఫవుంటెను పెన్నుకుం బయిక మిచ్చెదవా?

లింగ— "బాబూ! కాశికిం గలము వచ్చుచుండంగా ఫవుంటెను పెన్నెందులకు పనిలేక? అంతగా మన సైనచో అలుక పాన్పు మీాంద అన్నిటితోపాటు ఫవుంటెను పెన్నుగూడ నత్తగారి నడిగి పుచ్చుకొనవచ్చును. గాని బండివాని కేదో చెప్పి పంపి వేయుము.

బస—అదిమాత్రము నావల్లఁగాదు! (అని నిష్క్రమించును.)

లింగ—ఆ వన్నెల విసనకఱ్ఱ సంగతి యీ విధముగా నున్నది, యీ పాడకట్టెసంగతి యీవిధముగా నున్నది! పాడుటీచర్లు కుఱ్ఱవాండ్రను పాడుచేయుచున్నారు! పయిగా కలములక్రిందను, కాగితములక్రిందను కర్చుపడుచున్న డబ్బునకు లెక్కయే లేదు! కనుకనే గాంధిమహాత్ముఁడు చదువులకు స్వస్తి చెప్పింపుమన్నాఁడు. వివాహ మగువఱకును వీనిని మాన్పించుటకు వీలులేక చూచుచున్నాను. ఇదేమి ప్రారబ్ధమో యీదినములలో కాలేజికి వెళ్ళుచున్న వానికిఁగాని కట్నముల బిగువు లేకున్నది! ఈ కసుగాయకుంకను కట్నములకొఱకుఁ గాక గతులకొఱకుఁ బెంచుచున్నానా! నామొదటిపెండ్లికి రెండు వేలు రెండవపెండ్లికి నాలుగువేలు! మూడవపెండ్లి కెనిమిది వేలు మొత్తము పదునాలుగువేలు వచ్చినవి. ఈ కుంకకుఁ గూడ నిదేవిధముగా వచ్చునని యాశ. ఇదేమిపాపమో ఇంతవఱకు వేయి, రెండువేలు, ఇచ్చెద మనువారేకాని పట్టుమని పదివే లీయఁగలవా రగపడలేదు! నియోగ మంతకంతకు నిర్భాగ్యయోగ మయిపోవుచున్నది! ఎవరుచెపుమా వచ్చుచున్నది! చవటకుంక, తలుపుతీసి చక్కఁ బోయినాఁడు కాఁబలయును! బండివాఁడో పరదేశ బ్రాహ్మణుఁడో యై యుండును! కానిమ్ము గదితలుపు మూసి, యేమియు నెత్తుకొని పోకుండ, కంతలగుండాఁ గనిపెట్టెదను. (అని లేచును.)

పేర—(అంతలోఁ బ్రవేశించి) మహదైశ్వర్యాభివృద్ధిరస్తు! మనోవాంఛాఫల సిద్ధిరస్తు! రాజద్వారే రాజభవనే, రాజసభే, రాజసమీపే, సర్వదా దిగ్విజయమస్తు!

లింగ—ఏమీ! పేరయ్యయే! ఏదో పనిమీఁద వచ్చినట్లున్నావే!

పేర—ప్రభువులవద్దకు పని కోస్తే రాగలమా?

లింగ—అట్లయినఁ గూర్చుండి అదేమో చెప్పుము. (అని కూర్చుండును)

పేర—(కూర్చుండి తనలో) ఈ ముండాకొడుకు వగ్గిలి ముక్కుకు సూటిగా పోగూడదు. ముందీదారి త్రొక్కుతాను. (పయికి) చెప్పాట కేముంది? వస్తుకళానుపద్దుమీాద బదులు కావలసి వచ్చాను.

లింగ—ఎవరికి? ఏపాటి?

పేర—ఎవరికో తర్వాత చెప్పుతాను. బదులు కావలసింది పాతిక వేలు

లింగ—వడ్డి యేమయిన వాటముగ వేయించఁగలవా?

పేర—వడ్డీకేం వాజిబీప్రకారం పుచ్చుకోండి.

లింగ—వడ్డికి వాజిబీ యేమిటి? ఆసామిని బట్టియు, ఆస్తినిబట్టియు అవసరమును బట్టియు నుండును. నీతోడు రూపాయ తొమ్మి దణాల కాని చొప్పున నిన్ననే ముప్పదివే లిచ్చాను.

పేర—అయితే కుదరదు. ముప్పావలాఅంటే ముద్దుపెట్టుకుని ఇచ్చేవా రున్నారు. శలవు! (అని లేవఁబోవును).

లింగ—ఆఁగు! ఆఁగు! అంత తొందర కూడదు? ఆస్తిమాట చెప్పవేమి?

పేర—ఆస్తికేం అవల్‌రకం ఆస్తి, అరవై యకరాలు సర్వదుంబాలా యీనాంభూమి పదియకరాల గత్తానారింజతోట ఆరెకరాల అంటుమామిడితోట, తొమ్మిదెకరాల తుమ్మబీడు. ఇదే ప్రథమ తనఖా. ఇక విడిపించుకునేది కూడా కాదు.

లింగ—సరే పావలా అర్ధణా చొప్పున పయిసలు చేయుము.

పేర—పావలార్ధణా లేదు గీవాలార్ధణా లేదు. నా కమీాషనుదగ్గిర కలుపులు పెట్టకపోతే రూపాయివడ్డకూ రుద్దుతాను.

లింగ—నీ కమీాషనుమాట కేమి నీవెక్కడికీ బోదువు నేనెక్కడికీ బోను ముందు కాగితములు తెమ్ము చూతము.

పేర—కాగితాల కేం శే పీపాటికి కాకిచేత రప్పిస్తాను, (అని లేవఁబోయి. మరలఁ జతికిలఁబడి) అన్నట్టు అడగడం మఱచాను. అబ్బాయి కింకా వివాహం చేశారుకారు సమయం కాకనా సంబంధాలు రాకనా?

లింగ—సంబంధములు రాకేమి' సమాధానము చెప్పలేక చచ్చిపోవుచున్నాను. అన్నట్లు నీవు పెండ్లిండ్ల పేరగాఁడవు గదా నీ యెఱుకలోఁ జక్కని సంబంధ మేదయిన నున్నదా?

పేర—చక్కఁదో గిక్కఁదో నాకు తెలియదు, మీకు సానుకూలపడుతుందో లేదో అంతకంటే తెలియదు. పడితేమాత్రం బంగారాని కెత్తుకెత్తయిన సంబంధం వొకటి సర్వసిద్ధంగావుంది.

లింగ—ఎవరు వారు?

పేర—పుణ్యమూర్తుల పురుషోత్తమరావు పంతులుగారి కిద్దరు కొమార్తె లున్నారు. పెద్దకుమార్తెకు పదమూఢవ యేడు. పశ్యానికివచ్చిన పండు! ముఖం ముద్దు లోడుతోంటుంది? కళ్ళుచూస్తే కడుపు నిండవలసిందే! చక్కగా చదువుకుంది.

లింగ—సరేకాని కన్యకుఁ గావలసినవి చదువు చక్కదనముగావు,

గీ. తిండి యొకప్రక్క వెలితిగాఁ ♦ దినగవలయు,
చెప్పకయె యింటిపను లెల్లఁ ♦ జేయవలయు,
ఊరకే కొట్టినను పడి ♦ యుండవలయు,
ఇట్టికన్యను వెతికి ♦ గ్రహింపవలయు.

పేర—అలాగైతే మీరు చెప్పిన లక్షణా లన్నీ అచ్చంగా ఆపిల్లవద్దనే వున్నాయి. మూడు మెతుకులకంటె ముట్టదు. లేచిందిమొదలు పరుండేవరకూ లేడిపిల్లలాగు పనిచేస్తుంది.

లింగ—ఇంతకును కట్న మేపాటి యీయఁగలరు?

పేర—అదుగో అక్కడేవుంది తంటా! ఆపిల్ల లిద్దరకీ నంటను వెయ్యేసిరూపాయల బాలతొడుగు లున్నాయి. అయిదేసి వందలు వచ్చే, మాతామహు డిచ్చిన మాన్యా లున్నాయి. అందువల్ల కట్నం లేకుండా చేసుకుంటామని కావలసినంత మంది కాళ్లకాడికి వచ్చి తిరిగిపోతున్నారు.

లింగ—అయితే, పేరయ్యా! ఆ పిల్లయింటిని అచ్చముగా బంగారపు తొడుగుండుగాక అరువదిపుట్ల మాన్యముండుగాక గౌరవము కోరువాఁ డెవ్వఁడైనఁ గట్నములేని సంబంధమున కిష్టపడునా!

పేర—అలాగై తే, గౌరవార్థమని మెడలు విరిచే కాస్తోకూస్తో యిచ్చే లాగు చూడాలి. ఏమాత్రం అనమంటారు?

లింగ—అసలు ఆయనకున్న ఆస్తియేమో చెప్పినావుకావు.

పేర— ఆయనకున్న ఆస్తి యేమిటో అందఱూ యెఱిగినదే. పది సంవత్సరాలు రివిన్యూ యినిసిపేటరు పనిచేశా రన్నమాటే కాని పయిన పుచ్చుకొని యెఱుగరు. ఈమధ్య నానుకోప రేషాన్ని నమ్మి ఆవుద్యోగానికిగూడా హాస్తోదకాలిచ్చి హాయిగా రాట్నం ముందుపెట్టుకొని కూర్చున్నారు. అయితే, పిత్రార్జితం బాపతు పదియెకరాల భూముంది. పన్నులుపోగా పదియెకరాల వల్లా పదిపదులు నూరుబస్తాలు వస్తాయి. వారు కాపురంవున్న మేడవుంది.

లింగ— అట్లయినచో, నటువంటి పెద్దమనుష్యులను మన మంత యిబ్బంది పెట్టుట న్యాయముకాదు. ఆమేడవా రుంచుకొని ఆ పదియెకరముల పొలమును మనకు వ్రాసియిచ్చి అదనము కొఱకు వేయినూటపదార్లు రొక్కమూ, వెండిచెంబు వెండి కంచము, వెండి పావకోళ్ళు, అయిదుదినములు నైదుపట్టు తాబితాలు ఇటువంటివిమాత్ర మిమ్మనుము నా బారీతనము బాగుగ నున్నదా?

పేర — బొ గేమిటి బంగారం తొనకలాగుంది! కాకపోతే, కార్యమయిన మర్నాటినుంచి వాగు అన్నమో రామచంద్రాయని ఆవీధినీ యీవీధినీ అడుక్కు తినవలసిమాత్రం వుంటుంది! బాబూ! మీా బేరం కుదిరేబేరం కాదు! శలవు పుచ్చుకుంటా. (అని పోనుబోవును)

లింగ — (చెయ్యి పట్టుకొని) ఆగు ఆగు — అన్నిటిలో నొక్కుతోందరా! నీ యభిప్రాయ మేమిటి?

పేర — వేయిన్నూటపదహార్లు కయితే వెంటనే కుదురుస్తాను. అంతకు పయినైతే ఆ సంబంధం మీాకు దక్కదు.

లింగ — సరికాని యీపిల్లవానికింద నాకెంత సొమ్మయినదో యెఱుంగుదువా! తృప్తిగా వారివల్ల రాబట్టి తృణమో కణమో నావల్లం దినవలెనుగాని నీసొమ్మే పోయినట్లు నిగిడెదవేమి! పురుషోత్తమరావుగారు నాకంటెం బూర్వపుం జుట్టమా యేమిటి నీకు?

పేర — ఆలాగన్నారు గనుక, అసలుసంగతి మనవిచేస్తాను వినండి. ఆయన కట్నంలేని సంబంధం చెయ్యాలని ఆలోచిస్తున్నారు. నా బలవంతంమీాద నుహా పెడితే రెండువేలకంటె పెట్టరు. అందుచేత మనం కొంచెం మాయతోవ త్రొక్కాలి. ఆయనతో కట్నం మాటేమీా కచ్చితంగా చెప్పక మంచిరోజుచూచి మాట్లాడేనిమిత్తం మనయింటికి తీసుకువస్తాను సరీగా ఆ సమయానికి వివాహాల వీరయ్యగాడువచ్చి, వేలంపాటలోకి దించేలాగు ఏర్పాటు చేస్తాను. ఆ పాటలో పంతులుగారి కావేశం యెక్కించి, మూడువేలవరకూ పాడిస్తాను. నా కేమిస్తారో న్యాయంగా శలవివ్వండి!

లింగ — ముష్టి మూడువేలుకోస మిన్ని ముచ్చటలా! ఆ మూడువేలలోనే నీముదువా! చాలుచాలు! అథమపక్షం మైదువేలయిన లేకున్న మన కా సంబంధ మక్కఱలేదు,

పేర—అబ్బ లింగరాజుగారూ! అసాధ్యులుగదా! సరే, చచ్చి ముత్తమారో అయిదువేలూ అనిపిస్తా ననుకోండి అందులో, అయిదువందలు నావి మిగతవి మీవి. ఇష్టమేనా?

లింగ—అదిగో అదే పనికిరాదు! అందులో అణాకాని [illegible] కాఁగూడదు. నీయైదువందలు నీవు పయిగా రాబట్టుకొనవలసినదే.

పేర—సరే, నా తంటాలు నేనే పడతాను. మీరయ్యగార్ని పంపుతాను గానీ వాడూ మీరూ ముందు కాస్త కూడబలుక్కోండి. పని జరిగాక వాడికి పదిరూపాయలుమాత్రం పారేయ్యండి.

లింగ—దానికేమి తరువాత నీవో నేనో లేదనిపింతము లెమ్ము.

పేర—అన్నట్టు ఆభరణాల సంగతి చెప్పారుకారు. ఆభరణాలమాట చెవిని పడితేనేగాని ఆడంగులకు వేడే పుట్టదు.

లింగ—వెఱ్ఱివాఁడా! మాపిల్లకు మేము పెళ్లి చేసుకొంటున్నామా? అప్పుడడావడి పడవలసివచ్చునని అయిదువేల రూపాయల నగలు చేయించి సిద్ధముగా నుంచినాను.

పేర—సరే యింకేమీ నాకిప్పటికి శలవు! (అని లేచి నిష్క్రమించును)

లింగ—అన్నివిధములచేత నీ పేర మనుకూలమయినదే. పదియెకరముల భూమియుఁ బదివేలు, బాలెంతోడుగు వేయి, కట్నమయిదువేలు, మొత్తము పదునారువేలు! లాంఛనములనియు గింఛనము లనియు లాగుట కింకను లక్షమార్గము లున్నవి. ఆమీఁద నలుకపా న్నున్నది. ఆవెనుక నాపాఘపట్టీ యున్నది— ఆపైని గర్భాధానపు బెట్టున్నది!

గీ. స్వామికృపచేత నిది కొనఁ ♦ సాగెనేని
లాటరీలోనఁ బలె మంచి ♦ లాటు వచ్చు;
ఇంటిపనులెల్ల నేర్చిన ♦ గుంట కాన
వెంటనే వంటవానిని ♦ గెంటవచ్చు.

తెర పడును

ఇది ద్వితీయాంకము



# వరవిక్రయము

## తృతీయాంకము

### మొదటిరంగము.

ప్రదేశము: లింగరాజుగారి పడకగది.

సుభ—(చదువుకొనుచుఁ బ్రవేశించి, చటుక్కునఁ బుస్తకమును మూసి)
ఏమను! వివాహమన్న నీ విసులావిషయులదే వివాహము.
సమానవయోరూప సంపత్తి లేని దాంపత్య మేమిదాంపత్యము.

చ. ధనమె ప్రధానభూతముగ ♦ దంతము లూడినవాని కేనియుం
కన్యలఁ గట్టిపెట్టు తలి ♦ దండ్రులు హెచ్చగుచున్న యిట్టి దు
ర్దినములలోన, నింతిగ, ధ ♦ రిత్రిపయిం జనియించుకంటె ని
ర్జన వనవాటిలో, నజగ ♦ రంబుగ నేని జనింపఁగా దగున్!

ప్రాయ ముడిగిన ప్రారబ్ధమునకు తోడు, పిసినిగొట్టుపీనుఁగుఁ గూడ నగుచో నిఁకఁ జెప్పవలసిన దేమున్నది! నాకుఁ బట్టిన యవస్థయే పట్టును! భగవంతుఁడా! తండ్రీ! నాభర్తవంటి భర్తను మాత్రము పగవారికైనఁ బ్రసాదింపకుము!

సీ. నగపేరు చెప్పిన ♦ నవ్వులఁ బుచ్చును
కోకలు కొనుమన్న ♦ గొల్లుమనును
పాత్రంబు లిమ్మన ♦ విత్తంబు లేదను
కాగిత మడిగినఁ ♦ గాకపడును

పడియు మొసల్పునఁ ♦ విసవిసలాడును
నాసి పూవులు గొన్న ♦ కసుర్లుసునును
పత్తి మొదల్చెద నన ♦ వలవల యేడ్చును
మూష్టి పెట్టిన నెత్తి ♦ మొత్తుకొనును
పండుగకు పచ్చనున కైన ♦ బిండివంట
మాట యెత్తిన బగ్గున ♦ మండిపడును
కటకటా! యిట్టి మగనితోఁ ♦ గాఁపురంబు
సలుప శక్యమె యెంతటి ♦ సాధ్వికైన.

ఇంతటితోఁ దీఱెనదా!

సీ. జడవైచుకొన, సాని ♦ పడుచువఁటే యను
చీరగట్టిన షోకు ♦ మీఱె ననును
వంటవానిం బిల్వ ♦ వెంట నే తెంచును
పోలితో మాటాడఁ ♦ బొంచి వినును
చదివిన, వ్రాసిన, ♦ జగడమాడును, దొడ్డి
లోని కేగిన నను ♦ మానపడును
గడపదాఁటిన, వెన్కఁ ♦ గొడుకు నంపించును
పాడిన సతి కిది ♦ కూడదనును
ఇంటి కెవ్వరైన వచ్చిన ♦ వెంటఁబడును
తగునె యీచేష్ట లన పెంకి ♦ దాన వనును
కటకటా! యిట్టిమగనితోఁ ♦ గాపురంబు
సలుప శక్యమె యెంతటి – సాధ్వికైన.

ఇఁక సంసారసందర్భములు సరేసరి!

సీ. పుడకలంబు బిడుకలు ♦ ఒప్పాణమును దాఁచు
మొట్టకేలకు లెక్క ♦ పెట్టియుంచు

ఉప్పును బప్పుఁ దా ♦ నుండఁడు నడిమంచి
తులమ్మలచొప్పునఁ ♦ దూఁచి యిచ్చు
పెరటికూరల నెల్లఁ ♦ బెరవారి కమ్మించి
యేర్చి చచ్చుం బుచ్చు ♦ నింటికిచ్చు
వండినదేల్లఁ దా ♦ వడ్డించుకొని మెక్కి-
మిగతవారల కంట్లు మిగులనిచ్చు
తిరుగుచుండఁగనే యింటి ♦ దీప మార్చు
పలుకుచుండఁగనే గొంతు ♦ పగుల నార్చు
కటకటా! యిట్టి మగనితోఁ ♦ గాఁపురంబు
సలుప శక్యమె యెంతటి ♦ సాధ్వికైన!

తెరలో—మావన్నెల విసనకఱ్ఱ యేమిచేయుచున్నది?

సుభ—ఏమి చేయుచున్నదా? ఉసూరుమని యేడ్చుచున్నది!

లింగ—(ప్రవేశించి) ఓసీ! యెప్పుడుచూచిన నెందులకో కోటకోట లాడుచునే యుందువు. సంతోషముగా నుండు సమయ మెప్పుడే?

సుభ—చచ్చిన మఱునాఁడు!

లింగ— నీవా నేనా?

సుభ—మీకుఁ జా వేమిటి! ఎన్నికట్నము లందుకొనవలసియున్నదో యెందఱి గొంతు లింకనుఁ గోయవలసియున్నదో!

లింగ—కట్నములమాట కలకంఠుఁ డెఱుఁగును గాని పెన్నిధి వచ్చి నను నేనీకఁ బెండ్లిమాత్రము చేసికొనను! బుద్ధివచ్చినది!

సుభ—దాని కేమిలెండు! కలిమినిబట్టి యెవరికో గంగవెఱ్ఱు లెత్తక మానవు, సిగ్గు బుగ్గిచేసికొని మీరు సిద్ధపడక మానరు!

లింగ—సరే, అంతె యదృష్టము పట్టినప్పు డాలోచింపవచ్చును. గాని నామీఁద నీ కింతకోప మెందులకే?

సుభ — మీమీఁద నేమికోపము! నాతండ్రి మొఱ్ఱోయని మొత్తుకొను చుండ ఆయన మెడలు విరిచి అన్యాయముగ నాగొంతుకోసిన మాయమ్మమీఁదఁ దప్పు, నాకెవ్వరిమీఁదను కోపములేదు.

గీ. విద్యయు, వయస్సు, పసవును ♦ పడిచిపెట్టి
భాగ్య మొక్కటిదే చూచి ♦ ఒడుగు పిసిని
గొట్టు పీన్గునకుం దన ♦ కూఁతు నిచ్చు
తల్లి కుత్తుక తెఱగిసఁ ♦ దప్పు గలదె!

లింగ — ఓసీ! భర్తయన భగవంతుఁడుగదా భర్తనిట్టి పాడుమాట లనవచ్చునని యేపుస్తకములోనైన నున్నదా?

సుభ — ఆలియన నర్ధాంగిగదా అర్ధాంగి కన్నముపెట్టక, కూడఁబెట్టిన ధనముకూడఁ గొంపోయినవా రెవ్వరైన నున్నారా?

లింగ — అహహహహహా! అంటించినావే ముక్కుకుముక్కు! వెఱ్ఱిదానా! గడించినవాఁ డెవ్వఁడు కట్టుపెట్టి చచ్చినాఁడే! చూడు—

సీ. ప్రాయికంబుగఁ జెట్టు ♦ పాఁతువాఁ డొక్కఁడు
వరుసఁ బండ్లను మెక్కు ♦ వాఁ డొకండు
కష్టపడి గృహంబు ♦ కట్టువాఁ డొక్కఁడు
వసతిగ నివసించు ♦ వాఁ డొకండు
ఆస్తికై వ్యాజ్యంబు ♦ లాడువాఁ డొక్కఁడు
వచ్చిన నది మ్రింగువాఁ డొక్కఁడు
కోరి ముండను బెట్టు ♦ కొనెడివాఁ డొక్కఁడు
వలపుకాఁడై పొందు ♦ వాఁ డొకండు
అట్లె, ధనము కూర్చు ♦ నట్టివాఁ డొక్కఁడు
వడిగ, వగులఁబెట్టు ♦ వాఁ డొకండు,
ఇది ప్రపంచధర్మ ♦ మీనాఁడు పుట్టిన
లీలగాదు దీని ♦ కేల గోల?

సుభ—సరే కాని నా సమాధానముకూడ వినవరా?

లింగ—అక్కఱలేదక్కఱలేదు. ఈ వితండవాదమున కిప్పుడు తీఱిక లేదు. నీకొక శుభవార్త చెప్పిపోవలెనని వచ్చినాను.

సుభ—ఏమిటది? ఎవ్వరైన బదులుకొఱకు వచ్చుచున్నారా యేమి?

లింగ—బదులుఁగాదు బందులుఁగాదే అబ్బాయికిఁ బిల్ల నిచ్చుటకై పెండ్లికొడుకు చూపులకు వచ్చుచున్నారు.

సుభ—మనకుఁ బిల్ల నిచ్చునంతటి మతిమాలినవా రెవ్వ రబ్బా!

లింగ—ఎవరా? పుణ్యమూర్తులు పురుషోత్తమరావు పంతులుగారు.

సుభ—ఏమిటీ! కాళిందినా! కమలనా?

లింగ—కాళిందియో గీళిందియో నాకుఁ దెలియదు. పెద్దకొమార్తె.

సుభ—పేరుతో మీకేమిపని! సత్వముమాత్రము గల్గిన పెట్టెలోఁ బడిన జాలును! ఏపాటి?

లింగ—ఏమో వారియిష్టమే మిచ్చిననరే.

సుభ—అట్లయినఁ గాలమున కేదియో అంతరాయ మున్నదన్నమాటే! సరేకాని క్షౌరము చేయించుకొననే లేదుగద!

లింగ—అబ్బా, అగపడినప్పుడెల్ల క్షౌరపుగోలయే కదా! నేనట్టి జావఁ గానే, సర్వస్వము నీ క్షౌరముల క్రిందనే చెల్లు కాఁబోలును!

సుభ—మీకా విచార మెందులకు? మీరు పోవునప్పుడు మీ యినుపపెట్టె మీనెత్తి కెత్తెదనులెండు!

లింగ—ఆహా! అట్టి యవకాశమే యున్న నదృష్టమే మఱవచ్చును!

గీ. సంపద మహాత్మ్య మెఱుఁగని ♦ చవట బ్రహ్మ
చావు లేకుండగా నేని ♦ సలుపఁ డయ్యె
చచ్చునప్పుడు వెనువెంట ♦ సకలధనము
తీసికొనిపోవు విధమేని ♦ తెలుపఁ డయ్యె!

తెర పడును.

---

# రెండవ రంగము

ప్రదేశము: లింగరాజుగారి కచేరిచావడి.

ప్రవేశము: పురుషోత్తమరావుగారు, లింగరాజుగారు, బసవరాజు, పేరయ్య, వీరయ్య - చాపలపైఁ గూరుచుండి.

లింగ—విన్నారా? మున్నంగివారికిని మాకును మూడుతరములనుండి సంబంధ మవిచ్ఛిన్నముగా సాగుచున్నది. మూర్తిరాజుపంతులు గారా సంగతు లన్నియు నెత్తుకొని మూఁగే దుస్తరమువ్రాసి నారు. అందుచేత నింతదూర మాలోచింపవలసి వచ్చింది.

వీర—మూడు తరాలనాటి సంబంధ మొకటేనా? మూడువేల రూపాయల కట్నమో?

పేర—వీరయ్యా! నీగొడవ మావిపరీతంగా వుందే! మూడువేలు మూడువేలని యిక్కడికి ముప్పయిసార్లన్నావు. ముప్పైమూడు వేలు మీరేకాని న్మే మివ్వలే మనుకున్నావా? లింగరాజు గారు! ఆమొత్తం మేమే యిస్తాము. మాకింద ఖాయం!

వీర—అదేమన్నమాట? మీరధికంగా అన్న దేముంది?

పురు—అట్లయిన నింకొక యైదువంద లధికముగా నిచ్చెదము.

వీర—మా పంతులుగారు మఱి యైదువందలు

పేర—వామ్మోయ్! వొద్దునునూ వొద్దు! మాపంతులుగారిసంగతి తెలియక మాజోరుగా వస్తున్నావు! మాట దక్కదునుమా.

వీర—పేరయ్యా! నీ బెదిరింపులకు నేను జడిసేవాణ్ని కాను! మా పంతులుగారు పెట్టమన్న మొత్తంవఱకూ పెట్టిమఱీ తీఱతాను.

పురు—(రోషముతో) సరే కానిమ్ము నాలుగు వేల నాలుగువందలు!

వీర—అయిదువందలు

పురు—ఆఱు. రా. యెంతవఱకు రాగలవో రా.

వీర—రాక విడిచిపెడతానా? యేడువందలు.

పుర—ఎనిమిది?

బస—(తనలో) బాగు బాగు! పాఠ్యులాగునే యున్న దే!

గీ. సేకిలో నోకాలు లాడు ♦ వీరి నడి బ
జారులో గుడ్డలం బాడు ♦ నరణి; పెండ్లి
కొడుకును నీటు మధ్య సిడి, కసి ♦ గొన్న యట్లు
వేలముం బాడు చెన్న టను ♦ విని యెటులొ!

లింగ—వీరయ్యా! శిక్షింపఁ బాయపగూప వచ్చునా?

వీర—అప్పుడేనా? అయిదు వేలు!

పేర—(లేచి) బాబూ! యీ బేరం మనకు కుదిరేదికాదు లేవండి!

పుర—అయ్యా! సెలవు తీసికొను మనెదరా?

లింగ—సందర్భము లన్ని యుండ దమరు స్వయముగా విత్తగించుచు
నన్ను నెసపెట్టుట న్యాయమా?

పుర—సరే మీచిత్తము! (అని లేచి పేరయ్యతో బైట కేగును)

వీర—కొంపతీసి, బేరం గోవింద కొట్టదుగద?

లింగ—వెఱ్ఱివాఁడా! పేరయ్య అంత పెయ్యమ్మ యనుకొంటివా?

వీర—నన్ను మెచ్చుకో రేం? నా పాఠం నే నెల్లా నప్పగించాను.

లింగ—నిత్యముఁ గోర్టులలో బ్రతుకు ముండకొడుకవు నీకిది లెక్కా.
(అని యేదియో వ్రాయుచున్నట్లు నటించును)

బస—(తనలో) వీరి ప్రసంగమునుబట్టి వీరేదియో కుట్రసాగించునట్లు
కనఁబడుచున్నది. వీరయ్య ఘాల్లు పాటగాఁడై యుండును.

పేర—(బయటను) పంతులుగారు బహుదూరం వెళ్ళారు. ఇంతదూరం
వెళ్ళడం నాకిష్టంలేదు. వెళ్ళక చేసేఁగే కనపడలేదు. ఆ
యేల్నాటి శనిముండాకొడుకు లేకపోతే యెంచక్క ఘయన
లయ్యేది! చెరపడానికి చేటపెయ్యచాలును! నిజానికి నిలివెత్తు
ధన మిచ్చినా యీపాటి పిల్లవాఁడుమాత్రం యిక్క సందర్భ
పడడు.

పురు—పోనీం డింకను యెంతదూరము పోయి చూతము?

పేర— పోన్నటుకేం పోవచ్చును. ఆ నులుపుబలుపు లాలోచించుకో వలసినవారు మీరు. అమ్మగారితో ఆలోచించారా సరే— అవకాశంలేదు. మనం మళ్ళీవచ్చేసరికి సోమయాజులుగారు మంగళం పాడేస్తాడు.

పురు—అనవసరమగు నాలస్యమేకాని అని మాత్రమేమి చెప్పఁగలదు? ఇంకొకమాట యనిచూతము రండు.

పేర—అయితే, వొకపని చెయ్యండి—అవెనవతో వేలంపాట నాకిష్టం లేదు, ఆఖరుమాటని యింకో అయిదువంద లమాంతంగా పెట్టండి. దానితో దిమ్మ తిరిగిందా తిరుగుతుంది. తిరక్కపోతే, తిన్నగా యింటికి చక్కాపోదాం. ఏమి శెలవు?

పురు—సరే రండు. (అని పేరయ్యతో మరల లోపలి కేగి) లింగరాజుగారు! మఱియొకమాట యని పోవుదమని మరల వచ్చినాను. ఇంకొక యైదువంద లిచ్చెదము. ఇష్టమున్న మాకిరింద స్థిరపఱుపుడు—లేదా, యింతటితో మాకు సెలవు.

లింగ—మూర్తిరాజుగారికిరింద స్థిరపఱిచిన ట్టుత్తరము వ్రాయుటకు మొదలుపెట్టినానే! సరే సమాప్తి కాలేదు. కనుక దోషము లేదు. ఏమి పేరయ్యా! వీరికిరింద స్థిరపఱుప వచ్చునా?

పేర—వారు నా కిచ్చిన వర్ది యెంతవఱకో అంతవఱకూ పాడాను. టెల్లిగ్రాఫిచ్చి తిరిగీ ఆర్డరు తెప్పించుకునేవఱకూ ఆగండి.

లింగ—అదేమన్నమాట! అయిదునిమిషము లాగను. పెద్దమనుష్యుల కడ పేచీలు పనికిరావు! అయ్యా తమకిరింద ఖాయము.

పేర—తథాస్తు! పంతులుగారూ! తమవద్ద పదిరూపాయ లుంటే ప్రస్తుతము బజానాకిరింద జమకట్టించండీ!

పురు—(రూపాయలు తీసి యిచ్చును)

పేర—తమరు శాస్త్ర రశీదుముక్క వ్రాసి యిప్పించండీ.

లింగ- అభ్యంతర మేమిా? (అని రసీదు వ్రాసి చదువును)

"బ్రహ్మశ్రీ పుణ్యమూర్తుల పురుషోత్తమరావు పంతులుగారికి సింగరాజు లింగరాజు వ్రాసియిచ్చిన రశీదు. మిా కొమార్తె చి॥ సౌ॥ కాళిందిని, నాకుమారుడు చి॥ బసవరాజునకు చేసి కొనుటకును, అందుల్కై మిారుమాకు కట్నముకిందనైదువేలు యైదువందల రూపాయల రొక్కము, రవ్వలయుంగరము, వెండి చెంబులు, వెండికంచము, వెండిపావకోళ్ళు, పట్టుతాబితాలు, వియ్యపురాలు వియ్యంకుల లాంఛనములు యధావిధిగా నిచ్చుటకును, ప్రతిపూంట వెండ్లివారిని బ్యాండుతో బిలుచుటకును, రాణవోరలకు బండ్లు, రాత్రులు దివిటీలు నేర్పాటు చేయుటకును, రెండుసారులు పిండివంటలతో భోజనములు; మూడుసారులు కాఫీ, సోడా, యుప్మా, యిడ్డెన, దోసె, రవ్వలడ్డు, కాజా, మైసూరుపాగులతో ఫలాహారములు చొప్పున మా యిష్టానుసార మైదుదినములు మమ్ము గౌరవించుటకును అంపకాలనాడు మాకు పట్టుబట్టలు, మాతో వచ్చువారి కుప్పాడబట్టలు నిచ్చుటకును నిర్ణయించుకొని బజానాక్రింద పదిరూపాయ లిచ్చినారు గనుక ముట్టినవి.

"సింగరాజు లింగరాజు వ్రాలు" చాలునా?

పేర—చాలు బాబూ! చాలు! మచ్చుకోసం దాచిపెట్టుకో వలసిన మతలబు! (అని రసీదు తీసికొని పురుషోత్తమరావుగారి కిచ్చును)

పురు- బావగారూ! మాకిక సెలవా?

లింగ- చిత్తము. చిత్తము. తాతగారు పిల్లపేర వ్రాసియిచ్చిన దస్తావేజు నొకసారి పంపెదరా?

పురు- అభ్యంతరమేమిా? అట్లే పంపెదను.

తెరపడును.

ఇది తృతీయాంకము.



# వరవిక్రయము

## చతుర్థాంకము

### మొదటిరంగము.

కమ— (కాగితము చుట్టి కట్టిన ఛాయాపటము పట్టుకొని ప్రవేశించి) ఎప్పుడో మేడమీఁదినుండి యేమఱుపాటుగఁ జూచుటయేకాని సూటిగ నెన్నఁడుఁ జూచియుండలేదు. అందువల్ల ముందు నేను జూచి ఆవెనుక నక్కకుఁ జూపెద (అని కట్టువిప్పి; పటమును బయికి దీసి, పరికించి) సెబాసు! చేసికొన తగ్గవాఁడే.

ఉ. కన్నులు చాల పెద్దయవి; కన్బొమలుం గడుఁదీర్చి దిద్దిన
ట్లున్నవి; సోగమై తసరు చున్నది నాసికయున్, లలాట మ
త్యున్నతమై యొసంగుఁ; గురు లాత్తనియే యనవచ్చు; జాలునీ
వన్నెయు నన్నిటం దగినవాఁడె లభించెను నేఁటి కక్కకున్.

(బిగ్గఱగా) అక్కా! అక్కా! ఒకసారి యిటు వచ్చితివా— నీకొక చక్కని తాయము చూపెద!

కాళిం— (చటాలునఁ బ్రవేశించి) ఏమా తాయము?

కమ— (పటము దాఁచి) ఒక చిత్రపటము చూపిన నా కేమిచ్చెదవే?

కాళిం— అబ్బా? చంపక అదేమో చెప్పవే?

కమ—చెప్పితినిగా చిత్రమని.

కాళి—ఎవరిచిత్రము?

కమ—బావది!

కాళి—ఏ బావది?

కమ—ఇంకేబావ! అయిదువేల అయిదువందల బావ! ఇదుగో చూడు! (అని పటమును జూపఁబోవును)

కాళిం—(తొలఁగి) చాలు. చాలు! చూడనక్కఱలేదు! కొంపతీసి చూచినందులకుఁ గూడ సుంక మీయవలెనేమో!

కమ—సుంక మిచ్చియైనఁ జూడఁదగిన యందమే యక్కా!

కాళిం—అందమున కేమిలే అయిదువేల అయిదువందల కిమ్మతుగల బొమ్మ కాపాటి యందమైన నుండకుండునా?

కమ—అంతబెట్టు కూడ దక్కా! అఱకంటనైన నీయందమొక్క సారి చూడుము! (అని మరలఁ బటమును జూపఁబోవును)

కాళి—(త్రోసివేసి తప్పించుకొని) అబ్బా! అంతకంతకు నీ యాగడ మధిక మగుచున్నది సుమా! అంత యందగాఁడని తోఁచి నచో హాయిగ నీవు పెండ్లిగారాదుము!

కమ—ఔ నౌను! ఎక్కడను మగఁడు దొరకనియెడల నక్కమగఁడే దిక్కను సామెతే యుండనే యున్నదిగదా! ఇరువురము నింటఁ బడి తిని, ఇచ్చిన సొమ్మునకు వడ్డీయైనఁ గిట్టించుకొందము.

కాళి—లేదా యిరువురము నీళ్ళబిందెలు మోసి యింటి వెచ్చ మయినఁ గడుపుదము.

కమ—హాయి హాయి! ఆముక్క యందముగా నున్నదే!

కాళి—సరి కాని ఆ పటము నీకెట్లు వచ్చినది?

కమ—శుభలేఖలలో వేయించుటకై యున్న మన ఫొటోలు తీసిన నరేంద్రునిచేత నాన్నగారు తీయించినారఁట.

కాళి—వ్యవహార మప్పుడే శుభలేఖల వఱకు వచ్చినదా?

కమ—రాదా మఱి, ముహూర్త మింక మూడువారములే గదా యున్నది? అదుగో నాన్నగారు వచ్చుచున్నారు.

కాళి—(ఒక నిట్టూర్పు విడిచి, లోపలికిఁ జక్కఁబోవును)

పురు—(చరచర చావడిలోనికి వచ్చును)

కమ—నాన్నగారు! సరేంద్రుఁ డీ ఫొటో యిచ్చి వెళ్ళినాఁడు.

పురు—(చూచి) సరే, నీయొద్ద నుంపుము మీయమ్మ యేమి చేయుచున్నది? (అని పడకకుర్చీలోఁ గూలఁబడును.)

కమ—ఇదిగో యిచ్చటికే వచ్చుచున్నది. (అని నిష్క్రమించును)

భ్రమ—అదే మట్లున్నారు? ఎక్కడికి వెళ్లినా రింతసే పయినది?

పురు—ఎక్కడికని చెప్పుదును! ఊరంత యుఁ దిరిగి వచ్చినాను!

భ్రమ—అంత తిప్పట కిప్పు డవసర మేమి వచ్చినది? కమల సంగతి ప్రస్తుతము కట్టిపెట్టఁ దలఁచితిముగా?

పురు—అందులకుఁ గాదే అప్పులకొఱకు. కట్నము సొమ్ము ముందు పంపినగాని కార్యసన్నాహ మారంభింపమని లింగరాజుగారు వర్తమాన మంపినారు. అందుచేత, బదులుకొఱకు బయలు దేరినాను.

భ్రమ—ఎక్కడనూ జూడలేదిదెక్కడి పద్ధతి. కట్నమన, కళ్యాణ సమయమున నిచ్చునదికాని లంచమువలె, రహస్యముగా నింటికిఁ దీసికొనిపోయి యిచ్చునదియా?

పురు—లింగరాజుగారి సంగతి యెఱిఁగియు వెట్టిపడెద వేమి? అయిన నీ పాడుపని యందఱిలో జరుగుటకంటె నిదే మేలు.

భ్రమ—అందుల కిప్పు డయినపని యేమి?

పురు—అప్పు బుట్టుట యెంతకష్టమో అది తెలిసికొనుట యైనది.

సీ. మానాభిమానముల్ • మాపుకొని వలయును
ఘనుగును గోపంబు • విడువవలెను

సమయంబుఁ గనిపెట్టి ♦ సంధింప వలయును
త్రిప్పిన త్రిప్పలకు ♦ దిరుగవలెను
కోపి దేవుడ వని ♦ సేవింప వలయును
ఇచ్చకంబుల మురి ♦ యింప వలెను
ప్రోకరు రుసుమును ♦ బొడిగింప వలయును
దరి గుమాస్తాగానిఁ ♦ దనుప వలెను
నాల్గురె క్లేని యా స్తికి ♦ నప్పుజుప వలెను
వడ్డి యొంత స్సఁ దలయొగ్గ ♦ వలెను; వరతు
లేమి కోరిన శిరసా వ ♦ హింప వలెను
పుట్టునెడ నప్పటికిఁ గాని ♦ పుట్ట దప్పు.

భ్రమ—ఇంతేనా, మహా కెచ్చటనైనఁ బుట్టినట్లా?

పురు—పుట్టినచో నీ పురాణ మంతయు నెందులకు? ఆ పదియొకర ముల భూమిమీఁదను అయిదువేలకంటె నిచ్చువారగపడలేదు.

భ్రమ—మనకుఁ గావలసిన దెంత?

పురు—అయిదువేల యైదువందలు కట్నముగదా? ఆమీఁది వాని కొక యైదువంద లైనఁ గావలయునుగదా? ఎటుచూచిన మొత్తము పదువేలయిన లేకున్నఁ గార్యము జరిగి గట్టున బడలేము.

భ్రమ—అందుల కేమి యాలోచించినారు?

పురు—అయినమట్టున కమ్మివేయుటకు నిశ్చయించుకొన్నాను. కాని యదిమాత్ర మంత పయిపయి నున్నదా? అమ్మబోయిన నడవి, కొనబోయిన కొఱవి యన్నట్లు ఏడువేల యైదువందల కన్న నెక్కుని యేఁగాని పెట్టువా రగపడలేదు. పాపము, పేరయ్యగా రీవిషయమునఁ బడుచున్న పాట్లకు మేరలేదు.

భ్రమ—అరుగో మాటలలోనే యాయనయే వచ్చినారు,

పేర— (వగరుస్తూ ప్రవేశించి) బాబూ, తమునద్ద సెలవు పుచ్చుకొని యింటికి వెళ్ళేసరికీ అదృష్టవశాత్తూ మా అల్లుడీపూట రైల్లో వూడిపడ్డాడు. సందర్భవశాత్తూ అతనితో సంగతంతా చెప్ప వలసివచ్చింది. అతగాడు విని విని "మామా; అటువంటి గృహస్థుల కీలాటిసమయంలో అడ్డుపడడం కంటె కావలసిం దేమిటి? ఇంకో అయిదునంగలు వేసి ఆపొలం నాపేర వ్రాయిం చం"డన్నాడు. ఆపాటున బ్రతుకుజీవుడా అని ప్రాణసకూడా చెయ్యకుండా పరుగెత్తుకు చక్కావచ్చాను. ఏమి సెలవు?

పురు— సెలవున కేమున్నది? చెడి యమ్ముకొన్నను బదియొకరములకుం బదివే లయిన రాకపోవనుకొన్నాను. ఎక్కడను చుక్కనప్పు డేమి చేయఁగలము? పోనిండు అన్యులకుఁ బోవుటకంటె, మీ యల్లున కగుట నా కధిక సమ్మతము. దస్తావేజు వ్రాయింపుఁడు.

పేర— దస్తావేజు వ్రాయించడమే కాదు తక్షణం రిజిష్టరీ కూడా కావాలి. ఏమో అతగాడికి మళ్ళీ యేంబుద్ధి పుట్టునో యెవరు చెప్పగలరు. క్షణంలో దేవతార్చన చేసుకుని చక్కావస్తాను తమరుకూడా భోజనంచేసి, దానికి సంబంధించిన కాగితాలన్నీ తీసి వుంచండి. శెలవు. (అని పోవుచుఁ దనలో) అదృష్ట మనగా యిదీ అధమం రెండువేలయినా లాభిస్తాయి. ప్రస్తుతం అల్లుడుపేర వ్రాయించి, పదిరోజులు పోయాక పేరాయించు కుంటాను.

పురు—ఏమే స్నానమునకు లేవ వచ్చునా?

భ్రమ—లేవ వచ్చును గాని యీపదియొకరముల భూమియుఁ బోయి నచో నిఁక మన బ్రతుకు తెర వేమిటి?

పురు—వెఱ్ఱిదానా! యెంతమాటాడితి వే!

సీ. కూలి నాలియు లేక ♦ కుడువ తోపయు లేక
ఘులఘుల పస్తులు ♦ మాడువారు

ఇల్లు వాకిలి లేక • యిల్లాలు లేక, యే
చెట్టునీడనో నివ • సించువారు
పయిని పాతయు లేక, • పండ, జాపయు లేక
వడవడఁ జలిలోన • వడకువారు
కాళ్ళుఁ గన్నులు లేక, • కదల మెదల లేక
దేవుఁడా! యనుచు వా • పోవువారు
కలరు మన దేశమునఁ గోట్లకొలఁది నేఁడు!
వారి నెల్లర నెపుడుఁ • గన్నారఁ గనుచు
పందలంబోలె మన మిఁకఁ • బ్రతుకు టెట్టు
లనుచుఁ జింతింప వచ్చునే • యజ్ఞురాల!

భీమ—నిజమే! నిజమే!

సీ. ఱాతిలోఁ గప్పను • రక్షింపఁ గలతండ్రి
బొరియలోఁ జీమను • బ్రోచుతండ్రి
గంగలోఁ జేపను • గాపాడఁ గలతండ్రి
మంటిలో నెట్టను • మనుచుతండ్రి
పుట్టలోఁ జెదలను • బోషింపఁ గలతండ్రి
కలుగులో నెలుకను • గాంచుతండ్రి
నాభిలోఁ గ్రిముల క • న్నము పెట్టఁ గలతండ్రి
పేడలోఁ బురుగును • పెంచుతండ్రి
భూజముల కెల్ల నీరము • పోయుతండ్రి
శిశువుతో స్తన్యముం దయ • సేయుతండ్రి
దయయె స్వస్వరూపంబుగాఁ • దనరుతండ్రి
మనలఁ బోషింపఁడే నెట్టి • మాటగాక?

తెర పడును.

# రెండవ రంగము

ప్రదేశము : పురుషోత్తమరావుగారి లోపలి చావడి.

ప్రవేశము : భ్రమరాంబ, కాళింది.

భ్రమ—అమ్మాయి! యీపూఁట నీ వన్నమునకు రాలే దేమి?

కాళిం—ఆఁకలి లేకమ్మా?

భ్రమ—అ దేమే? యేపూఁట కాఁపూఁట యాఁకలి లేదని మొదలు పెట్టినావు. పెండ్లి తలపెట్టఁగానే పెండ్లికూఁతుల కెక్కడలేని కళయు వచ్చును. నీవే మిట్లు నీళ్ళు కారుచున్నావు.

కాళిం—అమ్మా! అడిగితివి కనుకఁ జెప్పుచున్నాను. ఈ పెండ్లి నా కిష్టము లేదే!

భ్రమ—అ దేమీ? ఆ పెండ్లికొడుకు నచ్చలేదా యేమిటి?

కాళిం—పెండ్లికొడుకు కాదు, పెండ్లియే నచ్చలేదు!

ఆ. మీకుఁ గులము లేద? • మాకు రూపము లేద?
యింత దైన్యమునకు • హేతు వేమి?
కట్న మిచ్చి వరుని • గడియించుకొనుకంటె
జిన్నతనము వేఱె • యున్న దమ్మ.

భ్రమ—ఇంతియే కద, యీ దురవస్థ యిపుడు మనకే పట్టినదా?

ఉ. కొంచెముపాటి వారలును • గొంపలు గోడులు నమ్మియేనియున్
సంచులు చంకఁ బెట్టుకొని • సంతకుఁ బోయినయట్లు పోయి కో
రించి బిగించి తంత్రములు వి ధించిన విత్తము ముందె చేతిలో
నుంచియు కాదె తెచ్చుకొను • చుండిరి కూఁతుల కిష్టు భర్తలన్.

కాళిం—అగుఁ గాక మనముకూడ వారినే యనుసరింపవలెనా?

గీ. అడుగువారికిఁ బాప భ • యంబు లేక
యిచ్చువారికి సిగ్గును • నెగ్గు లేక

నడచుచున్నట్టి వర కుక్క • నాటకమున
నకట! మనమును శాత్రిల • మగుట తగునె?

భ్రిమ— కాక చేయవలసిన దేమి?

ఆ. అప్పుకన్న, నల గ • యావళీ దక్షిణ
కన్న, పన్నుకన్న • కన్నతండ్రి
తద్దినంబుకన్న • తప్పనిసరి యయి
యున్న దిపుడు కట్న • మన్ని యెడల.

కాళిం—అమ్మా! అ దేమన్న మాట?

చ. తిరముగ నింటిముంగుఁ బెను • దేవళముండఁగ మ్రొక్కబళ్ళతోఁ
దిరుపతి కేగినట్లు కుల • దీపకు లెందఱో లేమిచే వివా
హరహితులై కనంబడెను • నప్పుడు వారిని రోసి కట్నమే
పరువుగ నెంచువారికయి • పర్వు లిడం బనియేమి వచ్చెనే?

భ్రిమ — తెలివమాలినదానా! నీవిప్పటి దేశకాల పాత్రములసంగతి
తెలియక మాటాడుచున్నావు!

ఆ. పిండిబొమ్మ యైనఁ, • బిల్ల నిచ్చెద మనఁ
గానె చేయిచాచుఁ • గట్నమునకు;
ఇట్టితరిని గట్న * మీయకుండఁగఁ బుస్తె
కట్టువరుఁడు జగతిఁ * గానఁబడునె?

కాళిం—పోనిమ్మ, లోక మంత గొడ్డుపోవునప్పు డీలొచ్చుపనికంటె
వివాహమే విసర్జింపఁ గూడదా?

గీ. కట్నమే కోరి వచ్చిన • ఖరముతోడ
తగుదు నని కాఁపురము సేయు • దానికంటెఁ
బెండ్లియే మానుకొని మగ • బిడ్డ వలెనె
తల్లిదండ్రులకడ నుంట • తప్పిదంబె?

భ్రిమ—అవివాహితయగు నాఁడుబిడ్డ యింటనుగల తల్లియవస్థ
అమ్మా! నీ కిపు డేమి తెలియును.

సీ. పెరవారి పిల్లకు ♦ వరు డేరుపడె నన
మనపిల్ల కెవ్వఁడో ♦ మగఁ డటంచు
పరులపిల్లల పెండ్లి ♦ పరికించు నప్పుడెల్ల
మనపిల్ల కెప్పుడో ♦ మను వటంచు
ఎదుటియింటికి నల్లుఁ ♦ డే తెంచినప్పుడెల్ల
మనయల్లుఁ డెప్పు డింట ♦ మసలు ననుచు
పొరుగింటి పిల్ల కాఁ ♦ పురము విన్నప్పుడెల్ల
మనపిల్ల కెట్టి ద ♦ బ్బునో యటంచు
ఆఁడుబిడ్డ జనించు టే ♦ యాదిగాను
పుస్తె మెడ బడువఱకు మా ♦ పులును బవలుఁ
గుడుచుచున్నను, గూర్చున్నఁ ♦ గునుకుచున్నఁ
దల్లి పడుబాధ తెలుపఁగఁ ♦ దరమె బిడ్డ?

**కాళిం**—అమ్మా! యిన్ని బాధలు పడి పెంచిన బిడ్డను ఇట్టి లంచ గొండులకుఁ గట్టబెట్టుటకంటె నవమాన మింకే మున్నదే?

**భ్రమ**—అయ్యవమాన మాలంచ మాసించువారికిఁ గాని మన కేమి?

**కాళిం**—అ దేమన్న మాట?

గీ. త్రాగువా రుంట చేతనే ♦ త్రాళ్ళగీత;
కొనెడువా రుంట చేతనే ♦ గోవులవధ;
పోవువా రుంట చేతనే ♦ భోగవృత్తి;
అట్లె, ప్రోత్సాహమే హేతు ♦ వన్నిటికిని.

**భ్రమ**— (వినుట నభినయించుచు) ఆఁగు మాఁగుము. అదిగో మీ నాన్నగారు కావలయును దలుపు తట్టుచున్నారు. ఆఁ! వచ్చె వచ్చె! (అని నడచి తలుపు తెఱచుట యభినయించును)

**పురు, పేర**— (ప్రవేశింతురు)

భ్రమ—వెళ్లినపని యైనదా?

పేర—అవడంలో అఖండ దిగ్విజయంగా అయింది. రిజిస్ట్రారుముండా కొడుకు చేతులో అయిదురూపాయల నోటూ పెట్టగానే, అది వరకు వచ్చినవార్నందర్నీ వెనకబెట్టి, అరగంటలో తేల్చేశాడు.

పురు-పెండ్లికొడుకు ముదుపు పేరయ్యగారిచేతఁ బంపివేయు మనెదవా? అదేమి నీ వట్లున్నావు?

భ్రమ—కాళింది నాకీ పెండ్లి వలదని కావలసినంత గందరగోళము చేయుచున్నది! ఏమి చెప్పినను దానితల కెక్కుట లేదు!

పురు—అదేమీ?

భ్రమ—కట్నమిచ్చి వరునిఁ దెచ్చుకొనుట గౌరవహీన మని. అనవాయతి లట్టిపోవునా? మీ పోలికలు పుణికి పుచ్చుకొన్నందులకు మీ తిక్కయే దానికిని బట్టుకొన్నది!

పురు—నాతిక్క నాబిడ్డలకుఁ గూడ నంటుకొనుట నా కానందమే కాని, భగవంతుఁడు ప్రతికూలుఁ డయినందున మాతిక్కతీర్చు మార్గము మాత్రమే లేకపోయినది! ఏదీ యెక్కడనున్న దొక్కసారి యిటు పిలువు.

కాళిం—(తొంగిచూచుకొని ప్రవేశించి) ఇదిగో యిక్కడనే యున్నానండి.

పురు-(దగ్గఱకుఁ దీసికొని, తల నిమురుచు) అమ్మా! మీయమ్మతో నేమో యన్నావఁట యేమిటి!

కాళిం—అమ్మతో నన్నమాట మీతోఁగూడ ననుటకే వచ్చినాను. నాన్నగారు! నాయెడ మీకు నిజముగాఁ బ్రేమ యున్నదా?

పురు—అమ్మా! నీ కట్టిసందేహ మేల కలిగినది?

కాళిం—ఉన్న యెడల—

ఆ. కూఁతు రనుచుఁ బరుల ♦ చేతిలోఁ బెట్టక
కొడు కటంచు నన్నుఁ ♦ గొంపలోనె

యుంచుకొనుఁడు, మీకు ♦ పెంచ లేకున్నఁ, గ
ష్టించి మిమ్ము నేనె ♦ పెంచు దాన.

పురు—(గడ్డము పుడుకుచు) వెఱ్ఱితల్లీ! బిడ్డను పెరవారి కిచ్చుట ప్రేమలేక కాదు. మఱేమంటివా!

ఆ. ఆఁడుబిడ్డ యెప్పుడు ♦ నన్యుల సొత్తొట
దానివారికడకు ♦ దానిఁ జేర్చు
భారమెల్లఁ దండ్రి ♦ పై నుండుఁ గావునఁ
దండ్రి జాలిగుండె ♦ డాల్ప వలయు!

కాళిం—నాన్నగారు! నాకీ పెండ్లి యెంతమాత్రము నచ్చ లేదు! ఎందుచేత నందురా?

గీ. కట్న మార్పించి నరుసిచేఁ ♦ గంఠమునకుఁ
బుస్తె కట్టించుకొని తృప్తిఁ ♦ బొందుకంటెఁ
దనకుఁ దానుగ మఱిప్పట ♦ త్రాటితోడఁ
గంఠమున కురి యిడుకొంటె ♦ గౌరవంబు!

పురు—(చటాలునఁ గౌఁగిలించుకొని) నాతల్లి! నాతల్లి! నా కడుపునఁ బుట్టి, నాకు బుద్ధి చెప్పఁగలదాన వైనందులకు, నా యాయువు గూడఁ బోసికొని బ్రతుకుము!

చ. సారిదిగ హెచ్చుచున్న వర ♦ శుల్క విపద్దశ మాన్పఁబూని, బి
ట్టఱచితి వేదికాస్థలుల, ♦ నాడితి బెక్కుసభాంతరంబులం,
బఱఁచి వ్యాసముల్ బరికి ♦ పత్రికలం బ్రచురింపఁ బంపితిన్,
హరహర! నీదుపాటి తెగు ♦ వైనను లేక భ్రమించితిం దుదన్!

భ్రమ—సరి సరి! చక్కఁగానే యున్నది! దానిపాటకు మీకు తాళముగూడ మొగలు పెట్టినారా?

పురు—తాళమును లేదు, తప్పెటయును లేదు గాని, దాని నేమి యనక, తగుమాటలతో నచ్చఁజెప్పుము.

కాళిం- నాన్నగారూ! నాకీ యేహ్యాస్పదపు మాటల చేతను నచ్చదు. నా యెడ నిజముగ దయ కలదేని నాపలుకులను పాటించి, ఈ యవమానపు వివాహప్రయత్న మింతటితో విరమింపుఁడు. లేదా, (అని, పైమాట రాక, యేడ్చుచుఁ గాళ్లపై బడును)

పురు-(శోకస్ఫూర్తి) అయ్యో తల్లీ! నే నేమి చేయుదును? ఆఁడు పడుచు అవివాహితయై యింటఁబడి యున్న, అపనిందల పాలు గాదా?

ఆ. లోటు లేసియెడనె ♦ లోపంబు కల్పన
చేసి, దానఁ దుష్టిఁ ♦ జెందు జగము!
ఇఁక రవంత లోప ♦ మే నిక్కముగఁ గాన
వచ్చె నేని బ్రతుక ♦ నిచ్చు నమ్మ.

కాళిం-అయ్యయ్యో. మీరుఁ గూడ నట్లనెద రేమి. నా కింగ్లీషు చెప్పిన దొరసానికి నలుబదియారేండ్లున్నవి. ఇప్పటికిఁ బెండ్లి లేదు- ఆమె యేమి యపనిందల పాలైనది?

భ్రమ-సరే యింక నేమీ, చక్కని యుపమానమే దొరకినది. ఆమెకును మనకును గల యంతర మేమో తెలియునా? మన దేశములో, నాఁడుది యాఁడుదే, మగవాఁడు మగవాఁడే. అక్కడనో, ఆఁడుది మగవాఁడు, మగవాఁ డాడుది. తెలిసినదా? ఈనుంకుతిన మీకఁ జాలును గాని, ఈపాటికి లోపలికి బోవుదము రమ్మి. (అని బలవంతముగాఁ గాళిందిని దీసికొని పోవును.)

పురు-పేరయ్యగారూ విన్నారా సంగతి?

పేర-విన్నాను బాబూ, విన్నాను. ఏమిటో యెఱిగి యెఱుగని పిల్లలకేం తెలుస్తాయి కష్టసుఖాలు.

పురు-ఇప్పుడే మని మీ సలహా?

పేర—తమకు నేను సలహా చెప్పాలా. అయినా దీని కంత సలహాతో ప నేముంది? కట్నంసొమ్ము పంపివేసినట్లు తెలస్తే, కార్యం లే దని ఆచిన్నదే వూరుకుంటుంది. ఆ కాస్త ముడీ వడిందా పెనిమిటి బెల్లమే అవుతాడు.

పురు—అట్లయిన నీకె నాలస్య మెందులకు? ఇదిగో సొమ్ము. ఇచ్చి చక్కరండు. (అని నోట్లు లెక్కపెట్టి) బజానాక్రింద నిచ్చిన పదిరూపాయలు మినహాయింతేమా?

పేర—ఆబ్రాహ్మడు నోట్లకు మారకం అడక్కుండా విడిచిపెడతాడా? ఆపదిరూపాయలూ అందుక్రింద సరిపుచ్చుతాను.

పురు—అట్లే కానిండు. (అని నోట్లిచ్చి) మీా రొకసారి చూడుడు.

పేర—(లెక్కచూచి) అయిదువేల అయిదువందలూ సరిగావున్నాయి. ఈదారినే వెళ్లి యిచ్చివేసి, ముట్టినట్టు ముక్కకూడా వ్రాయించుకు వస్తాను. శలవు. (అని కొంచెం మీాపలకు వచ్చి) బ్రతుకు జీవుడా. బ్రాహ్మడు పక్షాలో అడుగువేస్తాడేమో అని ప్రాణాలు కొట్టుకున్నాయి. లేచినవేళ మంచిది. అయినా, ఆడపిల్ల నింతహద్దుమీారనివ్వ గూడదు. అందుకనే ఆడపిల్లలకు చదు వంటే నా కరికాలుమంట నెత్తికెక్కుతుంది. వెనక నోసారి వెంకిముండ, ప్రక్కయింటిపిల్లతో బళ్ళోకివెళ్ళడానికి సిద్ధపడితే నేనేం చేశాను, స్తంభానికికట్టి చావగొట్టాను. అక్కడితో ఆరోగం వదలి అయిదుగురు బిడ్డల తల్లయింది. (అనుకొనుచు నిష్క్రమించును.)

పురు—(రవంత నడయాడి) ఔరా దురదృష్టము.

చ. కరమును నీతిబాహ్యములు కట్నపుఁ బెండిళు లంచు నుద్దులం
గురిసెను నిన్న దాఁక, దన కూఁతు వివాహముపట్ల నేఁడుకి
క్కురుమనకుండఁ గాళ్ళకడ కు న్నడిపించెను గట్న మిచ్చు న
ల్గురు ననుఁగూరిచి ఛేవిదులు గొట్టెదుయోగముపట్టె నే మనన్.

తెర పడును.



# వరవిక్రయము

## పంచమాంకము

ప్రదేశము : కాళిందీ కమలల గది.

కాళిం—(విచారముతోఁ బచారు చేయుచు) కటకటా! కట్నము కాళ్ళకడకుఁ బంపుటకూడ జరుగునపు డిఁక గార్య మేమున్నది.

ఉ. తెల్లముగా మనోగతము ♦ తెల్పిన, నేడ్చిన, మొత్తుకొన్న, నా
తల్లికిఁ దోఁచదాయె నిది ♦ తప్పిదమం బని యంచు! దండ్రియుం
జల్లఁగ గ్రిందిమీఁదెఱుఁగ ♦ జాలనుం గమనింప డాయె! నన్
జెల్లని డబ్బుక్రింద నిటు ♦ చేసితి వేమిటి కయ్య దైవమా!

ఔరా! ఆఁడుదానిబ్రతు కెంత యలుసుబ్రతు కైనది!

ఉ. లేదు స్వతంత్ర మొక్కలవ ♦ లేశము కూడ, నొకింతయేనియున్
లేదు యథార్థ గౌరవము; ♦ లే దొక యింతయు మెప్పు, పెండ్లియే
కాదు గృహంబు లమ్ముకొని ♦ కట్నము లర్పణ సేయకున్న నీ
మాదిరి నాఁడుపుట్టు వన ♦ మానవుఁ బుట్టువుక్రింద నేర్పడెన్.

ఇంతకును మూలమిప్పుడు నేను జేయవలసిన దేమిటి?

గీ. పయిక మాశించి దిగిన య ♦ బ్బాయిచేత
బొందు కట్టించుకొని తృప్తిఁ ♦ బొందఁ దగునె?
తల్లిదండ్రుల నెదిరించి, ♦ తగవు పెంచి
మొండికెత్తినయట్లు కూ ♦ ర్చుండఁ దగునె?

కమ—అక్కా! అక్కా! యీయాశ్చర్యము విన్నావా. (అని యుఱుకుచు, వార్తాపత్రిక చేతఁ బట్టుకొని, చరచరఁ బ్రవేశించును.)

కాళిం—ఏమి టది?

కమ—ఇదిగో చదివెద వినుము. "ఓరుగల్లులో నొక యువతి యొక యువకుని వరించెను. ఆయువకుఁడాఱువేలు కట్నమిచ్చినఁగాని యామెను బెండ్లియాడ నని నిరాకరించెను. ఆమెతలిదండ్రులా విత్తమీయలేక, అన్యసంబంధమును సిద్ధపఱిచిరి. ఆయువతి ఆయువకుం దక్క నన్యుని బెండ్లియాడుట కిష్టములేక, యారాత్రి విషపానము చేసి మరణించెను! ఈవరశుల్కముల ఫలిత మింతవఱకు వచ్చినది"

కాళిం—సెబాసు! చాల చక్కనిపని చేసినది!

గీ. పుట్టినప్పుడె లిఖియించు ♦ గిట్టు మనుచు
సకలజీవుల నొసటను ♦ జలజభవుఁడు,
ఇట్టిచో నంతరాత్మ సహింపనిపని
కొడఁబడుటకంటె జచ్చుటే ♦ యుత్తమంబు.

కమ—అట్టిసాహస మందఱకు నలవడుట యెక్కడ కాని, అమ్మ యన్నమునకుఁ బిలుచుచున్నది పోవుదము రమ్మా.

కాళిం—నాకింకను నాఁకలి యగుట లేదు. నీవు పోయి భుజింపుము.

కమ—అయ్యో! నీయాకలి అక్షయము గాను. ఇప్పు డెంత ప్రొద్దు పోయినదో యెఱుఁగుదువా? నాన్నగారు భోజనముచేసి, నారాయణ దాసుగారి హరికథలోనికి వెళ్ళినారు. అమ్మ మన కొఱకు కట్టియున్నది.

కాళిం—సరే కాని, యొక్కమాట, ఇంట నిప్పుడు సొమ్మేమియులేదు గదా యీకట్నపుసొమ్మెట్లువచ్చినదో నీ కేమేని తెలియునా?

కమ—పోతునూరులోని పొల మమ్మివేసినారు.

కాళిం—శ్రీరామ రామా? చివర కిదికూడనా?

కమ——ఏమి చేయు మనెదవు? ఈ దినములలో బిడ్డలం బడయుట యిందులకుఁ గాక మ రెందుల కని నీ యభిప్రాయము?

ఆ. కొడుకు పుట్టి చదువు ♦ కొంటకుఁ దాతలనాఁటి
మడులు మాన్యములును ♦ దుడిచివేయ;
కూఁతు రవతరించి ♦ కొంపలుం గోడు ల
మ్మించుచుండెఁ బెండ్లి ♦ లంచములకు?

కాళిం——నిజమే! నిజమే? అదిగో అమ్మ పిలుచుచున్నది. వెళ్ళు.

కమ— నీవుకూడ రమ్మా?

కాళిం——నా కాకలిలేదని చెప్పలేదా? తలకూడ నొచ్చుచున్నది. తక్షణమే సందుకొనిపగాని తగ్గదు. (అని కవాచిప్పైఁ గూలఁ బడును.)

కమ — సరే, నీయిష్టము! (అని నిష్క్రమించును)

కాళిం— హాహరా; ఆ పదియెకరములు విక్రయించి, అల్లునకుఁ జెల్లించుచుండిరిగదా ఆవల వీరిగతి యేమికావలసినది. మా ప్రాణముల కుసూరు మనుచు మలమల మాడవలసినదేనా? ఈమాట వినికూడ నేనీ దుర్న్యయకార్యమున కెట్లుసిద్ధపడుదును. దైవమా? యిందుల కేదియు దారి యగ పడుపవా? (స్మృతితో) అన్నట్లు దారికేమి? అపురూపమైన దారి యా మోరుగంటి యువతి యగపఱిచియే యున్నది. ఆదారిని నేను మాత్రమేల యనుసరింపఁగూడదు? ఈశ్వరాదేశము కూడ నదియె కాకున్న ఈపూఁటనె యావార్త యేల చెవిని బడ వలెను' కమల యేమన్నది? "అట్టి సాహస మందుటకు నలవడుట యెక్క"డని యూ? కాళిందీ! నీవీపాటి సాహసము నకుఁ గన్నులు మూసికొని సిద్ధపడలేవా? మానము కాపాడు కొన లేకున్న మానవతి యనిపించుకొనఁ గలవా? చెఱుపు నుండి మరలించినదే స్నేహము. పాపరహితమైనదే సన్ని, పుణ్య

మర్జించినదే బుద్ధి, అనుభవించినదే సౌఖ్యము, స్వాతంత్ర్యము కలిగినదే జన్మము, మర్యాద గాపాడుకొన్న వాడే మగవాడు మానము దక్కించుకొన్నదే మగువ. ఇప్పుడు తప్పిన నీ విక నెన్నడును జావకుండ బ్రతుకగలవా? ఏనాడు ప్రాణులు తల్లికడుపున బడునో ఆనాడె మృత్యువుకూడ వెంట బడును. శిశువు పుట్టగానే ముందు మృత్యువు ముద్దుపెట్టుకొని తరువాత దాదికిం బలెం దల్లి కిచ్చును. అట్టి స్థితిలో జావున కంత సందేహింపవలసిన పని యేమున్నది? లెమ్ము. లేచి నీతలి దండ్రుల కొక లేఖ వ్రాసి అవమానకరమైన నీ యొడలుబొంది నింతటితో విడిచిపెట్టుము. (అని దిగ్గునలేచి, గదితలుపుమూసి) అవునుగాని ఆత్మహత్య; అపకీర్తికిని, అధోగతికిని గూడ గారణముకదా అట్టిపని చేయవచ్చునా? (క్షణమాలోచించి) అయ్యో నామతికాల సన్ను నేనే మోరపెట్టుకొనుచుంటినేమి? బుస్సీ కంటం బడనొల్లక బుగ్గియైన బొబ్బిలి వెలమ యోధు వారి పౌరుషము తగ్గినదా? రుస్తుంఖానుని వశమగుట కిష్టములేక, రుధిరాంబరంబులతో నగ్నింబడి రూపుమాసిన పెద్దాపుర క్షత్రియాంగనల పెంపు సన్నగిల్లినదా? ఆయుధముచే నరులం బరిమార్చుట హత్యకాక, వీరధర్మ మగునప్పుడు భర్తతో సహగమనము సలుపుట బలవన్మరణము కాక, పాతివ్రత్య మగునప్పుడు అవమానమును దప్పించుకొనుటకై ప్రాణములను విడుచుట ఆత్మారాధనముకాక, ఆత్మహత్య యెట్లగును? కాదు పుమ్మాత్మికను గాదు? ఈ త్యాగమువల్ల నా గౌరవము నాకు దక్కుటయేకాక తల్లిదండ్రుల ధననష్టము కూడ దప్పును. (అని వ్రాతబల్లకడకుం బోయి, యుత్తరము వ్రాసి, మడిచి, బల్లపై నుంచి, లేచి) ఓగదీ? నీకొక నమస్కారము! ఓ శయ్యాదులారా? మీకు సాష్టాంగ ప్రణామములు? (రాట్నముకడకుం బోయి, ముద్దుపెట్టుకొని) నా ముద్దుల రాట్నమా? యింతటితో నీకును నాకును ఋణముసరి. గది

మోహనపు మూర్తివలె నీ కాళ్లకు ఎప్పుడును కదులుచునే యుండుఁ గాక! నీ నామగానము నెల్లప్పుడు నిఖిల దిశలయందును ధ్వనించుచునే యుండుఁగాక! కడపటి సేవగా నిన్నొకసారి కదిపి మంత్రిపోయెద! (అని రాట్నము త్రిప్పి నూలు తీసి) ఈ బారెఁడు పోగును నా భక్తికి నిదర్శనముగాఁ బ్రపంచమున నుండుఁగాక!

(అంతట తెరయెత్తగా పెరడును, బావియు గోచరించును)

(అటు నిటు జూచుచు, మెల్లఁగాఁ బెరటిలోని కరిగి) నా కింటి ముందుపుట్టిన నవమల్లికా నమస్కారము కమలయు నేనును గష్టపడి పెంచిన చేమంతులారా! మీకుఁ జేమోడ్పు. (అనుచు బావికడకుఁ బోయి) ఓ పరమేశ్వరా, ప్రయోజనార్థము నీవు ప్రసాదించిన యీశరీరము నిట్లు బావిపాలు సేయుచున్నందులకు మన్నింపుము, ఓ తలిదండ్రులారా, నన్నుఁ గని పెంచినందులకు మీ కివిగో నా కడపటి వందనములు, కాళింది యనుకూఁతును గననే లేదనుకొనుఁడు గాని, గర్భశోకముచేఁ గృశింపకుఁడు! భరతమాతా, ప్రణామములు, తల్లీ, నీవే నిర్భాగ్యస్థితిలో నుండునప్పుడు నీతనయల కేమిదారి చూపఁ గలవు? ఓ పాలకులారా, మీ పన్నులగోడవయే మీది కాని అపన్నలగు నాఁడుపడుచుల పన్నులగోడవ మీ కక్కఱలేదు గదా? వంగరాష్ట్రీశిశూస్మృతులే కాని, వరశుల్క శిశూస్మృతులను గల్పింపరుగదా, ఓ సంఘసంస్కర్తలారా, ఉపన్యాసవేదికలపై నూఁదరగొట్టుటయే కాని మీరేర్పరుపెట్టు ధర్మములనైన మీరనుష్ఠింపరేమి? పాచినోటనె కాఫీ, ప్రాతఃకాలము కాఁగానే క్షౌరము, మైలగుడ్డలతో తిండి మదరాసు కాఫీ హోటళ్లలో టిఫెను, ఇంటిలోఁగూడ నింగ్లీషు, బయటను గూడ పాడు మొగము, గొల్లవానిచేతి రొట్టె, గొడారువానిచేతి

పోడా, స్వమతమునెడ గౌరవ స్వధర్మము నెడ విముఖత, పద వులకై ప్రాకులాట, బిరుదములకై పీకులాట, దాస్యమునకు ముందడుగు త్యాగమునకు వెనుకడుగు, ఇవి తప్ప, యింత వరకు, సంఘమునందు మీరు ప్రవేశపెట్టిన సంస్కారము లగపడవేమి? ఓ దేశసేవా దురంధరులారా, ఈకట్నముల దుర్న్యయమును గూర్చి మీ రించుకయు నాలోచింపరేమి? శుల్క మననేమి! సుంకము, సుంక మన నేమి? పన్ను. ఈ పన్ను చెల్లించినంగాని బాలికలకు భర్త్రృయోగము లేదట, ఇంతకు మించిన యవమాన మింకేమున్నది? మీ బిడ్డల యవ మానమును దప్పింపని మీరు మీ దేశమునకే యవమాన మేమి తప్పింపఁగలరు? మీయిల్లుర పన్నుల నడ్డుకొనలేని మీరు మీదొరతనము వారి పన్నుల నేమి యడ్డుకొనఁ గలరు. ఎన్నెన్ని సంసారములు లేటఁ గలిసిపోవుచున్నవో యెఱుఁగు దురా! ఎందఱాఁడుబిడ్డల తండ్రులు ఏమిగతి దైవమా యని మొత్తుకొని యున్నారో చిత్తగించితిరా, శాసనమునకు గతి లేని వాఁడు, కడుపుచీల్చి కంచుకాఁగిడాలతో వెదకినగాని సింత యక్కరముముక్క కానిపించనివాడు కన్యాసచ్చేద మనగాఁనే, కట్నముకొఱకెంత బిఱ్ఱబిగియుచున్నాడో గమనించితిరా, ఆఁడుపడుచుల యవమానము నిట్లలక్ష్యము సేయుచున్న దేశ మున కయ్యో, అన్నవస్త్రము లుండునా, ఓ మగబిడ్డలం గన్న యొయ్యారులారా, కొడుకు పుట్టినది మొదలు, కొం డంతయాశతో, కలలో గూడ కట్నములనే పలవించు కలికాల పిశాచములారా, మీరు పుట్టినవిమాత్రమాఁడుపుట్టువు కాదా! ఆఁడపడుచు, నిట్లవమానపఱచుట మిమ్ములను మీ రవ మాన పఱచుకొనుటకాదా? ఇఁకనైన బుద్ధితెచ్చుకొని యీ దురాచారమును విడువుఁడు. విడువకున్న కాళింది యుసురు

మీా కింతను లకు జట్టుకొనక మానదు. ఓ యాఁడుబిడ్డలం గను సత్పురుషులారా, ఆఁడుబిడ్డ పుట్టగానే ఆవల నైనఁ బారవేయుఁడు గాని, అడిగిన లంచమిచ్చి పుస్తెకట్టించి అవమానముపాలు మాత్రము చేయకుఁడు! తల్లీ! కమలా! యిరువుర యొక కంచమునఁ దిని, యొక మంచమునఁ బరుండి పెరిఁగినవార మగుటచే, నిన్ను విడిచి పోవుట నాకు నిజముగ దుస్సహముగానే యున్నది! తప్పనిసరియైనచో, నీవుఁగూడ నీదారినే యనుసరింపుము కాని, అవమానమున కోడంబడి, నీయుక్క కప్రతిష్టమాత్రము కలిగింపకుము! ఓ శరీరమా! నీయవమానమును దప్పించుటకై, నిన్ను విడనాడి పోవు చున్నాను! ఓ జీవితమా! నీకుఁ జిరకాలచింత లేకుండఁజేయు టకై, నీలెక్క ముగించుచున్నాను! ఏమి హృదయమా! యేమి చేయుచున్నావు? నీవు నిర్మలముగా నుండవలసిన నిముసమిందియే! సాహసమా! నీవు సాయపడవలసిన సమయ మాసన్నమైనది! పిఱికితనమా! నా దరికి రాకుము! దాక్షి ణ్యమా! నీవు దవ్వులకుం బొమ్ము మోహమా! నీవు ముద్దువలెఁ బడియుండుము ధైర్యమా! నీవు బాపుసకురమ్ము! కన్నులారా! మీాకడసాగి చూపులు కానిఁడు! (చీరచెంగులు బిగించుకొని, బావికి ప్రదక్షిణము చేసి) ఓ కూపమా! నా తొలిస్నానము నీ నీటితోనైనది. నాశరీరము నీ నీటితోఁ బెరిగి నది. నా తుదిస్నానముకూడ నీ నీటితోనె కావించి, నీవు పెంచిన శరీరమును నీకే సమర్పించుచున్నాను! (వినుట నభిన యించి) అదిగో! ఆకాశవాణి నన్నమ్మాయీ రమ్మని పిలుచుచున్నది! అమ్మా! ఇదిగో వచ్చుచున్నాను! హా! పరమేశ్వరా. (అని బావిలో పడును)

ఇది పంచమాంకము





# వరవిక్రయము.

## షష్ఠాంకము

### మొదటి రంగము

(ప్రదేశము లింగరాజుగారి వ్యాపారపు గది)

లింగ—(బల్లకడఁ గూరుచుండి ప్రవేశించి) ఈ క్రొత్తగింజల దినములలోఁ గోమట్లు బదుళ్ళకొఱకుఁ గొంపచుట్టుఁ దిరిగెడివారు. ఈ యేఁడింతవఱకు వచ్చి యడిగినవారే లేరు!

గీ. ఆస్తి కలిగి తీఱుప లేని ♦ యప్పె యప్పు,
నూఱు గొని వేయికై వ్రాయు ♦ నోటె నోటు,
పసిడి తాకట్టుపై నిచ్చు ♦ బదులె బదులు;
రోజునడ్డీలు వచ్చిన ♦ రోజె రోజు.

ఘంట—(వచ్చి) బాబూ! బట్టలు కొనుక్కుంటాను. జీతమిస్తారా!

లింగ—ఏ బట్టలు పాడు గాను! ఎందుకురా బట్టలు! గాంధిమహాత్ముని జూడరాదా, గావంచా కట్టుకొని తిరుగుచున్నాఁడు.

ఘంట—గాంధిగార్ని మెచ్చుకుంటారు గదా, ఖద్దరు కట్టరేం మీరు!

లింగ—ఆవిషయములో, ఆయనకు మతి లేదురా! కట్టు కట్టు మనుటయే కాని, ఖరీదు తగ్గే సాధనము చూచినాఁడు కాఁడు.

ఘంట—మీకున్న మతి ఆయనకు లేదు గాని, నా జీతం మాట యేమిటి!

లింగ—ఆవల చెప్పెదఁ గాని. అమ్మగా రేమి చేయుచున్నది!

ఘంట—గదిలో కూర్చుండి కథలు చదువుకుంటున్నారు.

లింగ—నిన్నా స్కూలునకు వెళ్ళవద్దంటినిగదా యెందులకు వెళ్ళినావు?

ఘంట—బాగా నేవుంది! యే వైపూ వెళ్ళక యెల్లాగండీ? ఆవైపుకు వెళ్ళితే అమ్మగార్ని కొరుక్కుతినేస్తా! (అని నిష్క్రమించును)

లింగ—పెంకికుంక! పెడేటుస నెంతమా టన్నాఁడో! అయినను, వాని ననవలసిన పనిలేదు! ఈడు కడచిన వెనుకఁ బెండ్లి యాడిన బుద్ధిహీనుల కిట్టి చెప్పుదెబ్బలు తఱచుగా తగులుచునే యుండును!

సీ. ప్రాయము ముడిఁగి, రోమంబు ♦ పైఁ బడ్డ తరి, భ్రాంతిఁ
జెంది రెండవపెండ్లి ♦ చేసికొనుట
ఆస్తి దాయాదుల ♦ కగు నను చింతచేఁ
బెరవారి బిడ్డను ♦ బెంచుకొనుట
క్రొత్తలోఁ జూపు మ ♦ క్కువ లెల్ల మది నమ్మి
అత్తవారింటను ♦ పొత్తుకొనుట
అప్పులవారిని ♦ దప్పించుకొన సొత్తు
లితరుల పేర వ్రా ♦ యించియిడుట
పుడమి, నీనాలుగు జాల ♦ బుద్ధిమాలి
నట్టి పను లని పల్కుదు ♦ రార్యులెల్ల
నందు, మూడవపెండిలి ♦ యాడినట్టి
బడుగునకు నన్నుఁ గూర్చిచి ♦ పలుకనేల!

బన—(పత్రిక చేతఁ బట్టుకొని ప్రవేశించి) నాన్నా! ఆసంగతి పత్రికలోఁగూడ పడినదిసుమా!

లింగ—ఏ సంగతి?

బన—ఆపిల్ల బావిలోపడి చచ్చిన సంగతి. నాక్లాసు పిల్లలందఱు నిది చదివి, నన్నుఁ గాకులవలెఁ బొడుచుకొని తినుచున్నారు! పాడు కట్నముకొఱకు నీ వెందుల కంత ప్రాకులాడవలెను నాన్నా!

లింగ—ఓరి దామోదరుఁడా సర్వము విడిచిపెట్టిన గాంధికి స్వారాజ్య
ముకొఱ కంత ప్రాకులాట యెందులకురా?

జన—ఆయన ప్రాకులాట యంతయు నాయనకొఱకా?

లింగ—నా ప్రాకులాట మాత్రము నాకొఱకా? నీ తెలివి తెల్లవారి
నట్లే యున్నది. కాని ఏది యేమి పోడ్చినాఁడో చదువు!

జన—చదువును)

"మాపురమునందలి పుణ్యమూర్తుల పురుషోత్తమరావుపంతులు గారి కుమార్తెను లుబ్ధాగ్రేసరచక్రవర్తియగు సింగరాజు లింగరాజు గారు తనకుమారునకుఁ జేసుకొనుటకై, అయిదువేల అయిదువందల రూపాయలు కట్నము విధించి, యాసొమ్ము, కార్యమునకు ముందే కాఁజేసిరి! కట్నపు పెండ్లియెడ నిష్టము లేక కాళింది యను నాచిన్నది-తల్లిదండ్రుల కొక యుత్తరము వ్రాసి తన బల్లపైనుంచి బావిలో పడి ప్రాణములు విడిచెను! ఆయుత్తరమునం దున్న మాట లివి—

'నా ప్రియమైన తల్లిదండ్రులారా! నమస్కారములు! కట్నమిచ్చి తెచ్చినవరునిచే, కళ్యాణసూత్రము కట్టించుకొనుట గౌరవహీనమనియు-నా వివాహమునకై మీరు సర్వస్వము సమర్పించుట నా క్షేమమునకును మీ సౌఖ్యమునకునుగూడ భంగకరమనియు భావించి. ఈ రెంటియొక్కయు నివారణమునకై నే నీ లోకమును విడిచిపోవ నిశ్చయించుకొని యీజాబువ్రాసి యిచ్చుటనుంచి యనుజ్ఞ తీసికొనుచున్నాను. అమ్మ కాని, మీరు కాని, నాకై, అణుమాత్రమును జింతింప వలదని ప్రార్థించుచున్నాను. మీయిరువురకును బునఃప్రణామములు. చెల్లెలికి ముద్దులు!

ఇట్లు విన్నవించు మీ యనుంగు పుత్త్రిక—కా ళిం ది.'

ఒక పౌరుడు."

లింగ—(ఆగ్రహముతో) ఈ పౌరుఁ డెవ్వఁడో తెలిసికొని, పరువు
నష్టముక్రిందఁ బదివేలకు దావా పడవేయ వలసినదే! ఈ లుల్లి
గానికి నేను లుబ్ధాగ్రేసర చక్రవర్తి నఁట ఏమి పొగరు.

పేర—(అంతలోఁ బ్రవేశించి) అంతట మిమ్మనగలవాఁ డెవఁడు!

జన—(లేచి చక్కఁబోవును)

లింగ— రావోయి పేరయ్యా రా! ఏమిటి విశేషాలు?

పేర— (కూర్చుండి, ఏం చెప్పను భ్రమరాంబగారి దుఃఖం పట్టలేకున్నాం.

లింగ— అవి సరేకాని ఆ చచ్చిన దెబ్బ, ఆముడి కాసింతయు పడిన తరువాత నైన వచ్చినదికాదేమోయి?

పేర— అవునవును. అలా జరిగితే యీభూమీ దక్కి, యీ అయిదువేలూ దక్కి యీపాటి కింకో అయిదువేలకు బేరం తగిలేది.

లింగ— అదిగో అదే నాకు పట్టుకొన్న బాధ! చావున కేమి యెప్పుడైనా రావలసినదే. కవంత సందర్భానుసారముగా వచ్చిన బాగుండెడిది? సరేకాని యీసొమ్ముమాట యేమయిన వచ్చినదా?

పేర— ఎందుకు రాదూ? ఆసొమ్ముకోసమే నేనిప్పుడు వచ్చింది.

లింగ— అలాగునా? అయితే, ఆసొమ్మెంత మీదమీద నున్నదా? నే నెంతప్రయత్నము చేసినానో యెంతైనదో యెఱుగుదువా?

పేర— ఆ నష్టం మీసహాయించుకుని మిగతసొమ్ము యివ్వండి!

లింగ— ఇవ్వనియెడల?

పేర— దావా చేస్తాము.

లింగ— సాక్ష్యము?

పేర— మీ రసీదులే.

లింగ— పేరయ్యా! నేనంత వెయ్యమ్మనా? నాదస్తూరీవలె వ్రాయలేదు, నా సంతకమువలె చేయలేదు, నన్నా రసీదు లేమి చేయును?

పేర— (తనలో) ఆదిముండాకొడకా! అయిదువేలూ మింగివెయ్యాలనేనా కావోను! (పయికి) అంత పనోస్తే మేమందరం లేమూ?

లింగ— అందఱుమాటయు నావల చూతము గాని ముందు నీమాట చెప్పు నీ యైమువందలు మరల క్రక్కుట నిశ్చయమేనా?

పేర— కార్యం తప్పివచ్చినప్పుడు కక్కకేం చేస్తాం?

లింగ— ఇదిగో యిదే వైదికము! ఈమాట నియోగియైన వాడనునా?

పేర— అదుగో ఆమాటమాత్రం నే సంగీకరించను. మా వాళ్లి ప్పుడు మీ వాళ్లి సమాంతంగా సింగీసేవాళ్ళయినారు. మీ వాళ్ళు మీసాలమీద నిమ్మకాయలు నిలబడితే మావాళ్ళు మామిడికాయలు నిలవబెడుతున్నారు? మీవాళ్ళు జుట్టు మానేస్తే మావాళ్ళు బొట్టుకూడా మానేశారు! మీవాళ్లు మూరెడు గోచీ పెడితే మావాళ్ళు బారెడు గోచీ పెడుతు న్నారు! మీవాళ్లు వేలెడుచుట్ట కాలిస్తే మావాళ్ళు జానెడు చుట్ట కాలుస్తున్నారు! మీవాళ్ళు కాఫీహోటళ్ళకుపోతే మా వాళ్లు రెపరేషుమెంటు రూములకు పోతున్నారు. విన్నారా? యిన్ని మాట లెందుకూ ఇప్పుడు మీరన్నమాటల్లో యేం నియోగముంది? ఆనక కోర్టుమాట ఆలోచింతాం యీ సంగతి పైకివస్తే పదిమందీ మిమ్మల్ని బ్రతుకనిస్తారా? ఈ రోజుల్లో యింతచప్పని ఆలోచన మేము చేస్తామా!

లింగ— అట్లయిన, నీ కమ్మని యాలోచన మేమో కాసింత చెప్పుము

పేర— అదిగో అల్లా అడగండి! ఆ సొమ్మూ ఆ భూమీ సక్కించు కోవాలంటే ఆ రెండోపిల్ల నెల్లాగయినా చేసుకోవడమే సాధనము. మఱి యేదారి త్రొక్కినా మర్యాద పోకమానదు.

లింగ— అందుల కాయన యంగీకరించుట లేదని విన్నానే?

పేర— అది నిజమే. అయినా, నన్ను ప్రియత్నం చెయ్యమంటే చేస్తాను.

లింగ— ప్రయత్నము చేయుటకాదు పనియే చేసికొని రావలయును.

పేర— సరే. నాశక్తి యావత్తూ ధారపోస్తాను. శలవు. (నిష్క్రమిం).

లింగ— ఇంటను బయటను గూడ నల్లరిపడుటకన్న నిదే మంచిపని! పోయెనా దానితోపాటుగ నిదికూడ పోనేపోవును. లేదా అది యున్నది నే నున్నాను.

తెరపడును.

# రెండవ రంగము

ప్రదేశము: పురుషోత్తమరావుగారి కచేరిచావడి.

ప్రవేశము : క్రిందఁ గూర్చుండి యొకవంక పురుషోత్తమరావు గారు. పేరయ్య; మఱియొకవంక కమలను ముం దిడుకొని భ్రమరాంబ.

పురు— చినరకుఁ దేలిన యంశ మేమి ?

పేర— ఏం తేలిం దని మనవి చేయను ? మీరు నానుకోవాపరేట్లు గ్లని కోర్టుకు వెళ్లరని ఆయనకు బాగా తెలుసును. అందుచేత్త అంత మొండికెత్తి కూర్చున్నాఁడు.

పురు— అందుల కిప్పుడు మన మాచరింపవలసిన పని యేమిటి ?

పేర— నేనేం మనవి చెయ్యను ! కోటివరహాలు పోయినా మీరు కోర్టుకు వెళ్ళడం ధర్మంకాదు. అకారణంగా అంతసొమ్ము పోగొట్టుకోనడం అంతకన్నా ధర్మంకాదు. ఈచిక్కు లన్నీ అలోచించే చిన్నమ్మాయి నా చిన్నవాడికే యిస్తే తీరిపోతుం దని మనవి చేశాను.

పురు— అయిదువేల యైదువందలు నా బ్రాహ్మణుఁడు హరించినను సరిస్తే కాని, యిఁక నాయనతో సంబంధము నాకిష్టములేదు !

చ. పరువుఁ బ్రతిష్టయుం గనక, • పాపభయంబును మాటలేక యి క్కరణి ధనంబె జీవితమ్ముగాఁ • దలపోసెడు వానితోడఁ జు ట్టరికముచేసి, నిత్య మ • కటా ! యని చింతిలుకంటెఁ; గౌరవా దరపరులౌ గృహస్థుల స • దంబుల పైఁ బడవైచుటే తగున్ !

పేర— బాబూ ! యీ విషయంలో మీ రిల్లాటి పట్టుదల పెట్టుకో వలసిన పని లేదు. ఆయనమీద రోతచేత ఆయన పిల్లవాణ్ణి పోగొట్టుకోవడం నా అభిప్రాయం కాదు, ఏభయ్యేళ్ల ముండా కొడు కిన్నాళ్లు బ్రతుకుతాడు ! ఆ తరువాత పెత్తనమంతా అమ్మాయిదే. అవసీ, అటుండఁగా అంతసొమ్ము, ఆయన

చేతులలో చిక్కుపడ్డప్పుడు అడుసు తొక్కమా అని సందేహించడం ఆలోచన తక్కువపని కాదూ? అమ్మా! మీరల్లా వలపోస్తూ యేమీ చెప్పకపోతే యెల్లాగ? ఏదో విధంగా మఱచిపోవాలి కాని యెల్లకాలం అదే పనిగా విచారిస్తూవుంటే యెల్లా సాగుతాయి వ్యవహారాలు!

భామ— (కన్నీటితో) అయ్యో పేరయ్యగారూ!

ఉ. ఆననుచెక్కు, లాపెదవు ♦ లా మొగ, మామృగపెంపు భ్రూయుగం
బా వొస, లాశిరోరుహము, ♦ లామృదువాక్యము, లామృదుస్వరం
బా నయనంబు, లానడక, ♦ యావినయం బకటా! సుషుప్తియం
దేనియు సాధ్యమే మఱవ ♦ నీ దురదృష్టపు జీవితంబునన్!

సీ. ఎన్నఁడు నామాట ♦ కెదురు చెప్పఁగ లేదు!
తండ్రి గీచిన గీటు ♦ దాఁట లేదు!
బడి యన్న నెన్నఁడుఁ ♦ బ్రాలుమాలఁగ లేదు!
రాట్నంబు నెడలఁ బ ♦ రాకు లేదు!
అది నాకుఁ గావలె ♦ నని యెన్నఁ డన లేదు!
కుడుచునప్పుడుఁ గూడ ♦ గోడన లేదు!
ఆటలయం దైన ♦ నలుక యెన్నఁడు లేదు!
పొరుగింటి కేనియుఁ ♦ బోక లేదు!
కలికమున కేనియును నోటఁ ♦ గల్ల లేదు!
మచ్చునకు నేనియుం బొల్లు ♦ మాట లేదు!
అట్టి బిడ్డను బ్రతికి యు ♦ న్నంతవఱకు
మఱవ శక్యమె! వెఱ్ఱి ప్రా ♦ హ్మాణుఁడ! నాకు!

పురు— అహర్నిశలిట్లు వలపోయుచు ఆబిడ్డ నడలఁ గొట్టెదవా?
ఎంత చెప్పిన విన విది ♦ యేమి వెఱ్ఱి
యెవరిపని యైనతరువాత ♦ నెవ్వ రుంద్రు?

నాటకములోని వేష గాం • డ్రకును మనకు
నించుకేనియు భేద మెం • దేని గలదె !

వీర—అంతే నమ్మా! అంతే. బొమ్మలాటకాఁ డెంచేస్తాడు? ఏబొమ్మ పనివచ్చినప్పు డాబొమ్మను తెరమీఁది కెక్కిస్తాడు. ఆబొమ్మ పని కాఁగానే అడుగున పాఁ రేస్తాడు. ఆలాగే భగవంతుఁడూను! ఇం తెందుకూ? ఇరవయ్యేళ్లనుంచి వున్న పొడుంకుండు మొన్న నిట్టె పగిలిపోతె, నే నేం చెయ్యగలిగాను! ఏడిస్తె వచ్చేలా గుంటే మొన్నా ళ్ళేడవమన్నా వేడుస్తును?

పురు—ఏమే? యీ విషయమునందు నీ యభిప్రాయ మేమిటి?

భ్రమ—(కన్నులు తుడుచుకొని) మన యభిప్రాయములకు ఫలితముగా మనకు జరుగవలసిన శాస్తి జరుగనే జరిగినది. ఇంకను మనయభిప్రాయములమీఁదనే నడచినచో ఈయమ్మ కేమిబుద్ధి పుట్టునో యెవరు చెప్పగలరు! కావున, దాని యభిప్రాయము తెలిసికొని దాని యిష్ట మెట్లో యట్లే జరిగింపుఁడు.

వీర— అదీ బాగానే వుంది. అమ్మాయీ! నీయభిప్రాయ మేమిటో చెప్పమ్మా! నీ కా చిన్నవాణ్ణే నిశ్చయించమంటావా? లేక, అయిదువేల అయిదువందల పదిరూపాయలూ - ఆబ్రాహ్మడికి అర్పితంచేసి వూరుకోమంటావా!

కమ—(తనలో) ఇప్పుడు నా కర్తవ్య మేమిటి? అక్క సిద్ధాంతమునే యనుసరింపఁ దగునా? అందులకు భిన్నముగాంచి తల్లిదండ్రులకుఁ దాత్కాలిక మనశ్శాంతిని గలిగింపఁ దగునా. అక్క చెప్పినవాక్యము లన్నియు నాక్షేముత్తెము కోవలు. కట్నాల రాయలచేఁ గళ్యాణసూత్రము కట్టించుకొనుట. కంఠంబుఁ గత్తిమోపినపని మఱి లేదనుట నిశ్చయము! అట్టి వివాహము నాకును నంగీకారము లేదన్నచోఁ, దలిదండ్రులు నన్ను బల్మి

వంత పెట్ట రనటయు నిశ్చయమే కాని, దానివల్లఁ దేలు పర్య వసాన మేమి? అయిదు వేల నైదువందలు నా దుర్మార్గుని పొట్టను బెట్టించుట తప్ప మఱేమియు లేదు. అందువల్లఁ నా దారి విడిచిపెట్టి యీసంబంధమునే యంగీకరించి, ప్రాణమునకుం దగిన ప్రాయశ్చిత్తము చేయఁ గలిగినచో పేరిచ్చిన ద్రవ్యము వినియోగములోనికిఁ దెచ్చినదాన నగుటయే గాక అక్క కసి తీర్పఁగలిగినదాననై ప్రపంచమునకొక పాఠము నేర్పినదానను గూడ నగుదును. అయితే, అట్టి ప్రతీకారమే విధముగాఁ జేయగలుదును. (ఆలోచించి) సరే కానిమ్ము.

గీ. కట్టె మథియింప మథియింపఁ ♦ గలుగు నిప్పు!
భూమి త్రవ్వంగఁ ద్రవ్వంగఁ ♦ బుట్టునీరు;
పెరుఁగు తరువంగఁ దరువంగ ♦ వేర్చు వెన్న;
కన్పడదె దారి యోజింపఁ ♦ గార్యములకు?

పురు—అమ్మాయి! ఆయన యడిగినమాటకు బదులు చెప్ప వేమి! సందేహ మక్కఱలేదు. నీ యభిప్రాయ మేమో స్పష్టముగా జెప్పు, నిన్ను మే మించుకయు నిర్బంధించువారము కాము.

కమ—(తల వంచుకొని) మీ యిష్టము.

పురు—మా యిష్టముతో ఱకుఁ జూడ వలదు. నీయిష్టమే మాయిష్టము. నిశ్చయముగా నీయిష్టప్రకారము జరిగింతుము.

కమ—(కొంచెమాలోచించి) ఈవివాహమునకు సంబంధించిన యితర విషయములలోఁ గూడ నా యిష్టానుసారముగ నడువనిత్తురా?

పురు—సందేహ మేమిటి; సర్వత్ర నీ యిష్టమే మా యిష్టము. ఈ మాటకు నే నిసుమంతయుఁ దప్పిపోవువాఁడను గాను.

కమ—అట్లయిన, నా కంగీకారమే.

భ్రమ—(గోల నిముఁగుచు) అమ్మా! ఆనక మా గొంతుక కోయక ఆలోచించి మఱి చెప్పుము!

కమ—ఆలోచించియే చెప్పినాను. అనుమాన మక్కఱలేదు.

పేర—సెలాను తల్లీ! నామనస్సు కిప్పుడు నచ్చావు! సమయానికి లేకపోయింది కాని, ఫుంటే, పుద్ధరిణెడు పంచదార నోట్లో పోస్తును.

పురు—పేరయ్యగారు! పెరయాలోచనము లిఁక నెందులకు. సాయంకాలము మీఁరు వెళ్లి, సంగతి యాయనతోఁ జెప్పి, సరే యని పించుకొని రండు. (మెల్లగా) ఇంకొకటి కార్య మీనెలలలోను కావలెను. ఏమనెదరా? యీబిడగా రీసందడిలోఁబడి యిప్పటి వ్యసనమును గొంత మఱచిపోఁ గలదు.

పేర—బాగుంది బాబూ! బాగుంది. శలవుపుచ్చుకొని వెళ్ళి శటల్ చేసుకు చక్కావస్తాను. అమ్మా! శలవు. (అని నిష్క్రమించును)

పురు—(లేచి కమల నెత్తి యక్కునఁ జేర్చుకొని) తల్లీ!

ఆ. ఏండ్లకన్నఁ జాల • హెచ్చగు బుద్ధి నీ
కిచ్చి మమ్ముఁ దేల్చె • నీశ్వరుఁడు!
అక్క అట్లు చేసి • సంగుల కీ వైన
మాఁదు కనుల మెఁగుట • మనఁగదమ్మ!

కమ—(కొంచె మీవలకు వచ్చి తనలో)

ఉ. అక్కరో! నీమతంబునకు • నడ్డముగాఁ జనుచున్న నాయెడన్
మక్కువ వీడబోకు! మఱి • మానము లేనికతాన గాదు నే
నిక్కరణిం భ్రమించుట మ • శేమున దేవుఁడు మధ్యవర్తిగా
నిక్కము తెల్పుచుంటి నిటు • నీ కసి తీర్ప మదిం దలంచితిన్.

తెర పడును

ఇది షష్ఠాంకము



# వరవిక్రయము

## సప్తమాంకము

### మొదటి రంగము.

ప్రదేశము : లింగరాజుగారి పడకగది.

ప్రవేశము ; పక్కమంచముపైఁ గూర్చుండి లింగరాజుగారు, చేరువను నిలుచుండి సుభద్ర.

సుభ—సరే కాని, నలుగురు నట్టింటికి వచ్చునప్పుడైన నానగలు నా కీయఁ గూడదా? ఇంట శుభకార్య మగునప్పుడు గూడ నే నిట్లే యుండవలయునా?

లింగ—ఎందులకే యింత తొందర? ఎల్లుండిరాత్రి గదా వివాహము! అకారణముగా నీరెండు దినములు నలిగిపోవుటయే గదా?

సుభ—అబ్బబ్బా! యెప్పుడు చూచిన నగ లరిగిపోవు ననియు, బట్టలు చిరిగిపోవు ననియు, బియ్యము తరిగిపోవు ననియు, నిదే గోల కద! ఎందుల కీ భాగ్య మంతయు!

సీ. స్వారి చేయని గుఱ్ఱంబు, ◆ చదువ నట్టి
పుస్తకంబును, సేవింపఁ ◆ బోని మందు,
ఆరగింపని వంటక, ◆ మనుభవింప
నట్టి ధనమును వ్యర్థంబు ◆ లనుట వినరె?

లింగ—ఛీసీ! యెందుల కేడిపించెదవు. రేపిచ్చెద నూరకుండుము,

సుభ— నేను శుక్రవార మని సున్న చుట్టుటకా?

లింగ— నేడు గురువారము, గురువారము బొత్తిగాఁ గూడనిది.

సుభ— ఈవన్నెవా రింకఁ గోడలికేమి నగలు పెట్టుదురు?

లింగ— ఇక్కడికి నీసంగతి మైనది? ఇంకఁ గోడలి సంగతియా అబ్బబ్బా! ఆఁడువాండ్రకీ యాభరణాల రుచి యెవఁడు మప్పి నాఁడో కాని యేయింటఁ జూచిన నిదేగోల గదా! ఏడువార ములు నగలుం గల యిల్లాలు కూడ— ఎదుటియింటి ముత్తమ్మ ముక్కుపుడకి యెగువు తెచ్చుకున్నదాఁక నడ్డిపోదు! తాలూంకాలంట, జల్లాలంట, లోలకులంట, డోలకులంట, వాచీ గొలుసులంట, పేచీగొలుసులంట, అటుకులగాజులంట, యటు కులగాజులంట, యెప్పటికెప్పు డేమేమి రకములో దిగుమతి యగుచున్నవి! కమసాలులకుఁ గావలసినంతపని? షరాబులకుఁ గాలినంత బేరము.

సుభ— మీవంటి భర్తలకుమాత్రము ప్రాణసంకటము!

లింగ— సరేకాని చెప్పవచ్చినమాటలు పూర్తిగాఁ జెప్పనిచ్చినావే కావు. అనుదినము మనయింటికి వారు అరిసెలు, సున్ని, అప్ప డములు, వడియాలు, విధవలకని పిండి, స్వయంపాకులకని యుప్పు, పప్పు, బియ్యము, నేయి, అల్లము, బెల్లము, చింత పండు, మిరపకాయలు, కూరలు, నారలు, తలంట్లకని నూనె, నలుగుబిండి, కుంకుడుకాయలు, పీకాయ, కట్టెలు, పిడకలు. నబ్బు, సాంబ్రాణి, పసుపు, కుంకుమ మున్నగున వన్నియుఁ బంపుచుందురు. అవన్నియు జాగ్రత్తగా నందుకొని, ప్రక్క గదిలో భద్రపఱిచి, ఆఱవనాఁడు నా కప్పగించవలెను.

సుభ— ఎందుకిమిత్తము?

లింగ— ఏకముగా బజారునఁ బెట్టి యమ్మించుటకు.

సుభ— రామ రామా! నలుగురు నవ్వరా?

లింగ— సప్పాట కేమున్నది? ఉమామహేశ్వరరావుగారు ముసు నుప్పుతోఁగూడ నూరను దిప్పి యమ్మించలేదా?

సుభ— అట్లయిన, సదస్య సంభావనకూడ ఆయన యిచ్చినట్లు యిచ్చె వరు కావలయును.

లింగ— ఆయన, కాని కాసి యైన నిచ్చినాఁడు. నేనఱగానికూడ నీయను. పదిరూపాయలు పోలీసువారి ముగమునఁ గొట్టి పందిటిచుట్టును పారా వేసినచో నయిన సంభావనపని యుండదు.

సుభ— చివరకు నా చీరలగతి కూడ నింతియేనా యేమిటి?

లింగ— వెఱ్ఱిముగమా! నీకుఁ జీరల కేమిలోటు! అయిదురోజులు నైదుచీరలు అప్పగింతలచీరతో నాఱు. ఆఱుచీరలు నాఱేండ్లు కట్టవచ్చును. ఒక్కచీర లేనా? నీకు రావలసిన లాంఛనము లింకను లక్షయున్నవి. అయిదురోజులు నైదు ముహూర్తాలు అయిదు కాసులు, అయిదు వెండి పలుదోముపుల్లలు, అయిదు బంగారు తాటియాకులు, అయిదు వెండి పలుగుళ్ళపుల్లలు, అయిదు వెండి కాఫీ కప్పులు, అయిదు వెండి యుప్మాప్లేట్లు; అయిదు కుర్చీలు, అయిదు కాలిపీటలు; అయిదు మెత్తలు, అయిదు బాలీసులు. అయిదు బొట్టుపెట్టెలు, అయి దద్దములు, అయిదు దంతపు దువ్వెనలు, అయిదు కుంకుమ బరిణెలు, అయిదు కాటుక కాయలు, అయిదు గంధపు గిన్నెలు, అయిదు తలనూనె బుడ్లు. అయిదు సెంటుబుడ్లు, అయిదుసబ్బుపెట్టెలు, అయిదు పవుడరు డబ్బీలు, అయిదు చేతిరుమాళ్లు అయిదు గంధపుచెక్కలు, అయిదు చీనా విసనకఱ్ఱలు. భోజనములో వెండిచేపలు ఫలహారములో పసిఁడిపీతలు ఈలాటి వింతలు నెన్నియో వచ్చును. అవన్నియు జాబితా వ్రాసి యుంచినాను సాఁగదీసి సకలము రాఁబట్టుకో. ఆ యైదునాళ్లను నీయధికారమున కడ్డన్నమాట లేదు.

గీ. గ్రామదేవత కొకనాఁడె ♦ కానుకలును,
గొలుపులు శ్వేతపోతులు ♦ కుంభములును;
బింకముగ నైదుదినములు ♦ పెండ్లికొడుకు
తల్లికొలు, పక్క కొలుపును ♦ దాసి కొలుపు!

సుభ—సరేకాని పెండ్లికైన క్షౌరము చేయించుకొనెదరా లేదా?

లింగ—అదిగో మొదలుపెట్టితివా? ఆమాటమాత్రము మఱచిపోవు!
ఆవల నాకుఁ జాల పనియున్నది పోయెద! (నిష్క్రమించును)

సుభ—ఔరా! సృష్టివైచిత్ర్యము.

చ. కసకరమా కనంబడదు ♦ కన్నడఁ బోవదు ప్రేమ పొట్ట చీ
ల్చినఁ గనుపట్ట దెయ్యెడను ♦ సిగ్గనునట్టిదిపాపభీతి మ
చ్చునకును గానిపింప దిఁక ♦ సూనృత మన్నది లేనె లేదు లో
భిని భువి నేపదార్థములు ♦ పెట్టి విధాత సృజింపఁ గల్గెనో!

అన్నిటికంటెను విచిత్రమేమా?

గీ. ప్రాయికంబుగ రాజు దు ♦ ర్మతిని పెంచు;
మగువ తుంటరినే తన ♦ మది వరించు;
అంబుదంబులు కొండల ♦ యందె కురియు,
లచ్చి పెనులోభి యింటికే ♦ వచ్చి తనియు.

అయినను, వీరి ననవలసిన పనిలేదు. ఐశ్వర్య మనఁ గాలచక్రమువలె సదేపసిగఁ దిరుగుచుండునదికాని యొకచోటనె యుండునది కాదు!

గీ. పేదవాని కొడుకు ♦ పెనులోభియై కూర్చు
అతని కొడుకు త్యాగి ♦ యై చరించు,
త్యాగి కొడుకు మరల ♦ దారిద్ర్యయుతుఁ డగు;
సిరులు చక్రమట్లు ♦ తిరుగు నిట్లు?

తెర పడును.

# రెండవ రంగము

ప్రదేశము: పురుషోత్తమరావుగారి పెరటిలోని పెండ్లిపందిరి.

పురు—(కన్యాదాత వేషముతోఁ బ్రవేశించి) ఈప్రస్తుత మూఁడవ దినము ఇఁక రెండుదినములు గడువవలెను! ఆఁడుపిల్లకుఁ బెండ్లిసేయుటకంటె అశ్వమేధయాగము సేయుటసులభము.

సీ. తెల్లవాఱఁగనె యం • దెలకోడ నీళ్ళను
పలుదోముపుల్లలుఁ • బంపవలయు
కావిళ్లతో వెన్న • కాఁచియు, దోసె, లి
డ్డెనలు, నుప్మాయు న • డ్పింప వలయు
తరువాత భోజనా • ర్థము రండు రండని
పిలిచినవారినే • పిలువ వలయు
కుడుచునప్పుడు పంక్తి • నడుమ నాడుచుఁ బెండ్లి
వారి వాంఛలు కని • పెట్ట వలయు
ఒకఁడు రాకున్న వానికై • యోర్పుతోడ
మంచినీరైన ముట్టక • మాడ వలయు
ఇన్నిటికి నైచి, వేలు వ్య • యించి, గౌర
వించినను నిష్ఠురములె ప్రా • ప్తించు దుదకు!

ఘంట—(ప్రవేశించి) అయ్యా! వియ్యపరాలుగారు లేచేవేళయింది అమ్మగార్నింకా పంపించారు కారేం?

పురు—ఎందునిమిత్తము?

ఘంట—ఎందునిమిత్తమంటా రేమిటి? వియ్యపరాలుగారికి తెలివి రాగానే కండ్లు తుడవాలి కాళ్ళు మడవాలి కోక సర్దాలి కిందకు దింపాలి పెరట్లోకి పంపాలి నీళ్లచెం బందివ్వాలి రాగానే కాళ్ళు కడగాలి పండ్లుతోమాలి మొహం తొలవాలి నీళ్ళు పొయ్యాలి వళ్ళు తుడవాలి తల దువ్వాలి

కొత్తచీర కట్టాలి, కుర్చీ వెయ్యాలి, కూరోచ్చిపెట్టాలి, పారాణి రాయాలి, గంధంపుయ్యాలి, అత్తర్లివ్వాలి, పన్నీరు చల్లాలి, మొహాన్ని మోకాళ్ల గ్గాలి, కళ్లకు కానులద్దాలి, వంటిని వసవా లద్దాలి, వెండిపలుపు వెనకను కట్టాలి, బంగారుపలువు పక్కను చుట్టాలి, దిష్టితియ్యాలి, హారతివ్వాలి, అద్దాన్న మివ్వాలి, యిల్లాంటి యింకా నాతలవెంట్రుకలన్ని వున్నాయి. ఆలస్యమైతే అలకకట్నం చెల్లించవలసి వస్తుంది త్వరగా పంపించండి. (అని నిష్క్రమించును)

పురు—ఎన్నడు వినలేది వెక్కడిపద్ధతులు దేవుడా! దానియవస్థతోc బోల్చి చూచిన నాయవస్థయే మెఱుగు! ఓసీ యెక్కడ?

భ్రమ—(ప్రవేశించి) ఎందులకుc బిలిచినారు?

పురు—వియ్యపురాలు లేచువేళ మైన దcట. వర్తమానము వచ్చినది.

భ్రమ—ఇదిగో వెళ్ళుచున్నాను. మొహిరీ లెక్కడ నున్నవి?

పురు—నా చేతిపెట్టిలో నున్నవి. ఇవిగో తాళములు.

భ్రమ—(తాళములు తీసికొని నిష్క్రమించును)

పేర—(ప్రవేశించును)

పురు—వచ్చినారా? ఇcక రెండుదినము లున్నవి! ఈరెండుదినములుc కూడ దాటించితిరా యీ జన్మమున కీ శిక్ష చాలును.

పేర—ఇది గడ్డురోజు! ఈరోజు గడిచిందంటే యిక భయమే లేదు. లింగరాజు గారు నంచులుకోసి నంభావనిస్తారని పైవూళ్ల నుంచి కూడా బ్రాహ్మలు వచ్చారు. అయ నేమో, పోలీసు వాళ్ని అరంజిమెంటు చేస్తున్నారట, విన్నారా?

వీర—(ప్రవేశించి) అయ్యా! ఫలహారాల కావిళ్ళింకా పంపించారేం తారు. పెళ్ళివా రెంతసేపాగుతారు. ఎవరిమట్టుకు వారు కాఫీ హోటళ్లకు ప్రయాణా లవుతుంటే, పరుగుపరుగున నేను చక్కా వచ్చాను. మగపెళ్లివా ర్నిలా చూస్తే మర్యాద దక్కుతుందా?

పురు—ఇదిగో యిప్పుడే పంపెద. ఈపాటికి సిద్ధ మయ్యేయుండును.

వీర—ఏమి కావడమో. నిన్నటి వుప్మాలో నిమ్మపళ్ళరసమే లేదట. ఇడ్డెన్లలో అల్లంముక్కలు లేవట. కాఫీలో పంచదార లేదట ఈపూటయినా కాస్త యింపుగా వుండకపోతే పట్టుకువచ్చిన వాళ్ళ మొహాన్ని పెట్టికొట్టాలని పదిమందీ ఆలోచిస్తున్నారు. ఖారాఖిళ్లీలు కాస్త యెక్కువగా పంపండి. చుట్టలూ, సిగరెట్లూ. బీడీలూ కూడా కాస్తశుభ్రమైనవని చూడండి. నిన్న పంపిన చీట్లపేకలు నిన్ననే చిరిగిపోయాయి. ఈపూట టింకో నాలుగెక్కువ పంపండి. మదరాసు సన్యంమాట మరిచిపోకండి. కలవు. మరి యాలస్యమైతే మాటదక్కదు.

అని నిష్క్రమించును.)

పురు—ఏమి నిరంకుశాధికారము. ఏమి మిలటరీ ఫోర్సు. మగపెండ్లివారన మరిడీదేవతలు కారుగదా (అనుకొనుచు లోనకేగును)

పేర—ఎనిమిదివేలకూ, ఏభయ్యో, వందో వుంటాయి. యింతవఱకు నాచేతులో పయిసా పడలేదు. ఇప్పుడే నాది నేను వదుల్కోవాలి కాని, ఆనక వీరిచ్చేదేమిటి చచ్చేదేమిటి ఆనక వీరి కన్న ముంటే గద. ఈరోజుల్లో ఆడపిల్ల పెళ్లి చేశాక, యింకా వుండే దేమిటి, వుద్ధరి! తొలినా డడావడి, మలినా డాయాసం, మూడు మంగళాష్టకాలు నాలుగు సిగపట్ల గోత్రాలు. అయిదు అప్పగింతలు ఆరు అంపకాలు. ఏడు వంట బ్రాహ్మల తగువు. ఎనిమిది ఋణదాత నోటీసు. తొమ్మిది జవాబు. పది దావా. పదకొండు స్టేటుమెంటు, పన్నెండు విచారణ. పదమూడు డిక్రీ. పధ్నాలుగు టముటమా, పదిహేను వేలం, పదహారు చిప్ప. ఈరోజుల్లో యిదే పదహారు రోజుల పండుగ. కాబట్టి, వెళ్ళి కదిపి చూస్తాను. (నిష్క్రమించును.

# మూడవ రంగము

ప్రవేశము - పురుషోత్తమరావుగారి భోజనముల సందిరి

పురు—ఇప్పుడు రెండుగంట లైనది. ఇంతవర కొక్కరును రాలేదు. వంటలు చల్లారిపోవుచున్నవి. వంటవారు కన్నులమూయుచున్నారు.

సీ. పిలిచిన బలుకక, ♦ బిగుసుకొని లోన
మునుగు బెట్టెడు శుద్ధ ♦ మూర్ఖు డొకడు
ఇదె వత్తు మీవెన్క ♦ నే నిదాకు పొండని
చుట్ట ముట్టించెడు ♦ శుంఠ యొకడు
ఒగి దనకై వేచి ♦ యుంద్రొ లేదో చూత
మని జాగు సల్పెడి ♦ యల్పు డొకడు
ముందు వచ్చిన భాగ్య ♦ ముక్కటో సనుకొని
కడను రాజూచు ము ♦ష్కరు డొకండు
కుడిచి యింటను హాయిగా ♦ గూరుచుండి
వత్తురాసని చెప్పని ♦ వాజె యొకడు
వచ్చి కోపించి పోవుని ♦ ర్భాగ్యు డొకడు
ఆటువేల్వాగి విందులు ♦ తీరు లివ్వి

పేర—(వగర్చుచు బ్రవేశించి) బాబూ. యీపూట నామచ్చ మూసింది. తిరిగి తిరిగి తిరిగి కాళ్ళు విగిగాయి. (అనికూలబడును)

పురు—ఏ మన్నారు? పెండ్లివా రెవరైన వచ్చుచున్నట్లా?

పేర—ఏం పెళ్ళివారు. ఏం రావడం. పోలీసువారిచేత పాడిపించినందుకు, బయటకు వస్తే బాపిమ్మాలు చంపేస్తా రని, యీపూట లింగరాజుగారింట్లోనే అత్తీసరు వేయించుకుని ఆరగించారు.

పురు—కిడమవారు?

పేర—ఇదిగో వస్తున్నా. లింగరాజుగారి మొదటిభార్య శేషమాంబ భావమరది తోడల్లుడు తమ్ముడట, ఆయనకీప్పాట ఝుమ్మడ్లన్నలో

అల్లంముక్కలు తక్కువైనాయట అందుకోసం అలిగి కూర్చు న్నాడు. పెళ్ళికొడుకు జనకసంబంధం బావతు పినతండ్రిగారి సవతి తల్లి తమ్ముడు బావమరిదికి వేలువిడిచిన మేనమామకొడు కట, ఆయనకు రాత్రి చిన్నపీట వేశారట. అందుకోసం భీష్మించి కూర్చున్నాడు వియ్యపురాలుగారి అన్న పిన్నత్తగారి ఆడపడుచు తోడికోడలు సవతితల్లి తమ్ముడు మేనమామగారి మేనత్తకొడుకు మేష్టరుగారితో వచ్చిన స్నేహితుడుగారట, ఆయన్ని రాత్రి మీరందరితోపాటు ఆదరించలేదట, అందు కోసం రైలుకు పోతానని రంకెలు వేస్తున్నాడు. స్నాతకం నాడు రాత్రి బంగాళాదుంపల కూరా, పకోడీల పులుసూ చేయిం చారు కారట, అందుకోసం వారిపూట వెళ్ళడం మానివేదా మా అని ఆలోచిస్తున్నారు. వారంతా రానిది మేమెల్లా వస్తామని కడంవారు కాళ్ళు చాచుకు కూర్చున్నారు. ఇక తమరు వెళ్ళి తంటాలు పడవలసిందే కాని నావల్లకాదు.

పురు—ఊరివారు?

పేర—వూరివారు మామూలుప్రకారమే "ఇదుగో వస్తున్నాం పదండి."

పురు—రామమూర్తిగారు రాలేదేమీ?

పేర—పట్టుబట్ట మరచెంబూ తేవడానికి బ్రాహ్మడు దొరకలేదట, బ్రాహ్మణ్ణి వెతికించడానికి కూలిమనిషి కోసం బయల్దేరారు.

పురు—వైనులుగారో?

పేర—నిన్న తలవెంట్రుక లున్న పూర్వసువాసినీ యెవరో వంటశాల వైపునకు వచ్చిందట, పాప మందుకోసం ప్రాయశ్చిత్తం చేయించుకుంటున్నారు. ఈపూట శాకపాకా లేమిటని అడి గితే, పనసకాయ కూరా, పులిహోరా, బొబ్బట్లు, బూందీ మిఠాయి, అని చెప్పాను. అయితే, అయిదునిముషాల్లో వస్తాను, శ్రద్ధ మన్నారు.

పురు— అచ్యుతరామయ్యగారో?

పేర— ఈసమధ్య బ్రాహ్మసమాధిగా దెవరో పైఅధికారిగా వస్తే ఆయనకోసం యజ్ఞోపవీతాలు తీసి పారవేశారట నిన్న చౌక్కాతో వస్తే నలుగురూ వవ్వారట సాయంకాలానికి జంధ్యం సంపాదించుకుని వస్తాననా్నరు.

భామి— (కోపముతోఁ బ్రవేశించి) పేరయ్యగారూ! ఏది యేరి చివర కంతచక్కని సంబంధము సంపాదించినారండి వారి లాంఛనము లెవరు పురంజాలు తెంపి పుచ్చుకొనుచున్నారు? మన కీయవలసివచ్చినప్పుడు "మా కానవాయితి లే"దనుచున్నారు. మన మిచ్చిన కట్నమునుబట్టి మంగళహారతిలో మన కైదు నూరు పరాలులు రావలెనుగదా? వారు వరహాకంటె నేయరుగదా?

పురు— ఈమాట చెప్పుట కేనా నీవిపుడు వచ్చినది?

భామి— ఇదికాదు ఈపూట వియ్యపురాలి పినతల్లికూతురు తోడి కోడలియొక్క యాఁడుబిడ్డ సవతి మొగమున నద్దిన మొహిరీ నోటుగా నున్నదఁట అందులకై యామె యలిగినదఁట పియ్యపురాలు విచారించుచుఁ గూర్చున్నదఁట అమ్మలక్కలందఱుఁ జుట్టును మూఁగి యామెకుఁ బుద్ధిచెప్పుచున్నారఁట.

పురు— సరే వెళ్ళి కాళ్లమీఁదఁ బడి కటాక్షింపుమని వేడుదముపద! పేరయ్యగారు. నేను వచ్చువరకును మీరిచ్చట నుండుఁడు.

[అని భార్యతోఁ బరిక్రమించి, ఆకసమువంకఁ జేతులు జోడించి]

గీ. ఆఁడుబిడ్డ పెండ్లి • అతి లోభితోఁడఁజు
ట్టఱిక మొముకలెల్లఁ • గోరుకు లొక్క
జాతి కింట విందు • సర్వేశ్వరా? పగ
వారికి న్విధింప • వలదు, వలదు.

తెర పడును.



# వరవిక్రయము

## అష్టమాంకము

### మొదటి రంగము.

ప్రదేశము: వెఱ్ఱిబుఱ్ఱల వెంగళప్పగారి కచేరి చావడి

వెంగ—(పడకకుర్చీలోఁ బరుండి) అదిగో! పదికూడా అయినది ఇప్పటి కొక్క పార్టీ రాలేదు; ఇంకా వచ్చే దేమిటి ఈవిధంగాఁ వున్నది వ్యాపారం! పది కొట్టేసరికి, పాగా, కోటూ, తగిలించుకుని సాయిలవాళ్ళలాగు చక్కాబోయి, కచేరీ కాంపౌండుల లోనూ, రైలుస్టేషనులవద్దనూ, ఘాటీపాకలవద్దనూ కూడా కాచి మనిషి కంటబడేసరికి మరిడీ దేవతవలె పట్టుకుంటూ వుంటే యెందరికని యేడుస్తవి కేసులు! ఈరోజులలో నాలుగే వృత్తులు. ఒకటి సిగరెట్ల దుకాణం. రెండు కాఫీహోటలు. మూడు మెడికల్ ప్రాక్టీసు. నాలుగు ప్లీడరీ. యేసందులోకి వెళ్ళి, యే గుమ్మంవంక చూచినా ఏ 'సిటీసిగరెట్ స్టోర్సు' బోర్డో యే 'మైసూరు మహాలక్ష్మీవిలాస్ కాఫీక్లబ్బు' బోర్డో యే 'ఏ. డి. రాజు, ఎల్. ఎమ్. యస్' మెడికల్ ప్రాక్టీషనర్' బోర్డో యే 'బీ. వీ. రాఘవాచారి, బి. యే, బి. యల్. హైకోర్టు వకీలు' బోర్డో ప్రత్యక్షం? ఈ నాలుగువృత్తులలో కాఫీహోటల్ ఫస్టు; ప్లీడరీ లాస్టు! నాన్‌కోవాపరేషను కొంత

నాశనం చేస్తే స్టాంపుడ్యూటీ పెరిగి సర్వం నాశనం చేసింది! ఈ తాలూకాబోర్డు ప్రెసిడెంటు పదవే రాకపోతే యీపాటికి కీబీరువా లమ్ముకుని పోవలసిందే! దీనితల్లీ బొడ్డు పొక్క దీనికీ వచ్చాయిప్పుడు తిప్పలు! పోయిన సంవత్సరం అమాం బాపతులూ అయిదువేలు గిట్టాయి. ఈసంవత్సరం టి. యే. ఫిక్సేషను చేసి, మానోట్లో మన్ను కొట్టారు! ఇది పోతే యిక, కెంటాక్టిర్ల కమీషను ఈ సంవత్సరం వాళ్ళివ్వవలసిందికూడా నిరుడే వాడుకున్నాను. ఇక వాళ్ళిచ్చే దేమిటి చచ్చే దేమిటి? పోతే, యిక, యిచ్చుమిందా స్కూలు టీచర్లున్నారు. ఫయినులు వేసీ, బదిలీలుచేసీ, బర్తరఫులు చేసీ గోలయెత్తేస్తే ఒక్కొక్క నెలజీతం వూడిపడేసరికి చుక్కలు రాల్తాయి. పయివాళ్ళను తగ్గించి, బంధువులను తెచ్చిపెట్టుకోవడం మొదలు పెట్టాక అదీ అఘోరంగానే వుంది! ఈకాకిపిండా లైనా ముట్టకుండా స్వరాజ్యపార్టీవా రెక్కడకూడా సన్నాహాలు మొదలుపెట్టారు. ఎలక్షనురోజులు దగ్గిర పడుతున్నాయి! వెనకటిలాగే వోట్లు కొందామంటే వెనకటి ఋణమే యిప్పటికింకా తీరలేదు. బాగా వచ్చేటప్పుడు వొళ్లు తెలియక బ్రాందిదగ్గిరనుంచీ అలవాటు చేసుకున్నాను. ప్రాతఃకాల మయ్యేసరికి బాటిల్ కావాలి. ఈ తిప్పలకుతోడు యింటిదాని బాధొకటి పట్టు కున్నది! ఫస్టు తారీఖున రెండు పెద్దకాసులూ చేతులో పెట్టక పోతే చెప్పుదెబ్బలు తప్పవు! ఆరాత్రి దానికంట పడడము చేత, ఆవిధంగా రాజీ చేసుకోక తప్పిందికాదు. ఎవరో వచ్చు చున్నారు! (అని లేచి, గంభీరముగాఁ గూరుచుండును)

ఒక టీచరు—(చేతులు కట్టుకొని ప్రవేశించి, నమస్కరించి) అయ్యా! నేను అచ్చన్నపేట స్కూలుతాలూకు అయిదో టీచర్నండి.

వెంగ—అయితే, యేమంటావు? ఆనంగినంగివేషా లేమిటి?

టీచ—నల్లూరులో నాభార్య కనలేక మూర్ఛనాళ్ళనుంచి కష్టపడుతూవుం దండి. రెండురోజులు సెల విప్పిస్తే వెళ్ళివస్తానండి.

వెంగ—నీభార్య కష్టపడుతూవుంటే నీ వెందుకు యేడవను? నీవు కనిపిస్తావా? లేక, నకల్తానామా పుచ్చుకుని నీవే కంటావా?

టీచ— డాక్టరు దొరసానిగార్ని తీసుకు వెళ్ళుతానండి.

వెంగ—అబ్బో! నీ మొహాని కది కూడానా! ఇనస్పెక్టరుగార్ని చూచావా?

టీచ—చూచానండి చూస్తే తమతో మనవి చేసుకో మన్నారు.

వెంగ—అయితే, ఆపిడితను ముందుచూచి ఆపిడిత నెళ్ళమంటే అప్పుడు వచ్చావన్నమాట ఫో! సెలవు లేదుగిలవూలేదు ఫో!

టీచ—(దైన్యముతో) అయ్యా! కటాక్షించాలి! కష్టసమయం.

వెంగ—పొమ్మంటే పొయ్యావుకావు కనక సెండుచూపాయలు పైను.

టీచ—మహానుభావులు! దైవస్వరూపులు, మన్నించాలి.

వెంగ—పయిననా్న కదల్లేదు గనక, పదిహేనురోజులు సస్పెంటు.

టీచ—అధికార్లు ఆగ్రహపడితే నే నాగలేను అనుగ్రహించాలి.

వెంగ— సస్పెంటన్నా జంకావుకావు కనుక డిస్మిస్ చేశాను ఫో.

టీచ—ఆరి ఛండాలుడా? ఆమాటకూడా అనేశావా; సరే! ఇంతేనా యింకేమయినా చెయ్యగలవా? ఈమూడేళ్ళ ముష్టిపదవీ పోగానే, యింటింటా, అడుక్కు తినే యోగం నీకుగాని యీ పాటి కాటి కాపరి పని మాకు దొరకకపోదు. అదిగాక నీవంటి అధమాధముల కాలంలో, హడిలిపోతూ నవుకరీ చెయ్యడం కంటె యాయవార మెత్తుకున్నా మంచిదే. శేషాద్రిగారి చెప్పులు మోసి కామ్మరాజుగారి కాళ్ళుగుద్ది మాలవాడికి వంటింట్లో వమం ఛంవేసి వారికే సాధ్యంకాని వోట్లకు వంధలకు వందలు సమ

స్సిం-చీ, యీ సామ్రాజ్యం సంపాదించావు! అయితే యేమీ ఆపద్ధపా ట్లన్నీ, అప్పుడే దులిపేశావు! అల్పున కధికారం పట్టినా, ఆడదానికి వైధవ్యం వచ్చినా, యెద్దు కచ్చుపోసినా యేనాడికి పెత్తన మిచ్చినా, క్షణంలో స్వరం మారుతుం దన్నవాఁడు వెఱ్ఱివాఁడా! ఏమి విపరీతకాలం వచ్చిందో! యెక్కడ చూఁచినా, మునిసిపాలిటీలూ, లోకలు బోర్డులూ, నిరక్షర కుక్షులతోనో, నీవంటి నీచాతినీచులతోనో నిండిపో తున్నాయి! అయిందాకా, అడ్డమైనగడ్డి కరవడం! అయిందన గానే, ఆకాశం ముట్టడం! ఇదీ యిప్పటి మర్యాద! అయినా, మీయాపద మ్రొక్కులు నమ్మి మీవాంటివాళ్ళకు వోట్లిచ్చే వారి ననాలిగాని మిమ్మననవలసిన పనిలేదు! మీకు వోట్లివ్వ డంవల్ల మీ పాపాల్లో భాగం పంచుకోవలసి వుంటుం దన్న సంగతి తెలిస్తే వొక్కరైనా మీకు వోటిస్తారా? నీకూ కాలం దగ్గిర పడ్డది! కాకపోతే, కళ్ళింత మూసుకుపోవు! ఇనస్పెక్టరుగారిమీద నీ కింత కడుపుమం టెందుకూ! నీతో గలిసి, నీపాటకు తాళం వేశారు కారనేనా? ఆయన చెప్పులు మొయ్యడానికైనా నీ కర్హత వున్నదా; నీవు చేసిన దారుణా లకు, నీగుండెల్లో గునపంలాగు, అమహారాజు కాస్త అండ గా వుండబట్టే. యింత అన్నం తిన్నాం! ప్రతివార్నీ పిడత పిడ తంటావు! పిడ తేమిటి, నీ పిండాకూడు! ఎంతమంది నీ జీవా నికిపడి యేడుస్తున్నారో, యెందరి వుసురు నీ యింటా వంటా చుట్టుకుంటూ వుందో. యెక్కి యింత పొంగి బోర్ల పడు తున్నావు! భగవంతుడు మామొర వినకా పోడు. పటుక్కున నీదుంప తెంపకాపోడు! ఈసారి నిన్నెల్లాగా యీడ్చిపారేస్తారు ఈమాటలుమాత్రం మనస్సులో వుంచుకో! ఇక సెలవు!

(నిష్క్రమించును)

వెంగ—హామ్మో! హామ్మో! యెంతలేసిమాట లన్నాడు! ఆ వెధవ

అల్లా దులిపేస్తూవుంటే, పాడునోరు పైకి లేచిందేకాదేం! ఇదే కామోను గిల్టీ క్షానన్సంటారు! నిజంగా ఇంతనిర్భాగ్యపు వెధవను నే నిదివరకెన్నడూ కాలేదు. నా ధూం ధాములు చూచి, నలుగురు టీచర్లూ నా అంతవాడు లేడనుకునేవారు! ఈసంగతి తెలిస్తే యిక నన్నెవడైనా లక్ష్య పెడతాడా! సమయానికి చాకలి కేథవకూడా లేకుండా పోయాడు! అవసరానికి లేకపోయినందు కావెధవను డిస్మిస్ చేసి తీరతాను! అదేవస్తు.

లింగ—(ప్రవేశించి) ఈపూటపంతులుగా రింత తీరికగానున్నా రేమి?

వెంగ—దయచెయ్యండి! యేమి తీరిక. యేమిలోకం! పార్టీలంతా యిప్పుడే జనలకు పోయారు. ఎవరో టీచరువచ్చి, యేదో చెప్పు కుంటుంటే వింటున్నాను. ఏమిటి సమాచారం? కూర్చోండి!

లింగ—(కూర్చుండి) పుణ్యమూర్తుల పురుషోత్తమరావు పంతులుగారి కొమార్తెను మాపిల్లవాని కిచ్చిన సంగతి మీకెరిగినదేగదా? వివాహకాలమున నాలుగువేల రూపాయల నగ లుంచినారు. వివాహమై మూడేండ్లు కావచ్చినది. పిల్లను గాపురమునకును బంపరు. మానగలు మాకిమ్మన్న మాటాడను మాటాడను. అసలురహస్య మేమా? ఆనగలు మనవి కావు. తరువాతం జూచుకొంద మని తాకట్టు వస్తువులు తీసి తగిలించినాను. తాకట్టు పెట్టినవా రిపుడు నన్ను తాటించుచున్నారు.

వెంగ—కార్యంకాగానే చల్లగా సంగ్రహించుకోక పోయారా?

లింగ—అప్పటి నాయభిప్రాయ మదే. కాని సాగినది కాదు. ఆపిల్ల యేలాగుననో నాయభిప్రాయము కనిపెట్టి అందుల కవకాశము చిక్క నిచ్చినది కాదు.

వెంగ—ఆపిల్ల కిప్పు డెన్నో యేడు?

లింగ—పదునాలుగవ యేడు ప్రవేశించినది,

వెంగ— అయితే, మైనార్టి వదలలేదన్నమాట. అబ్బాయికో?

లింగ— పందొమ్మిది.

వెంగ— సరే, దానికేం, ముందో నోటీసుముక్క వ్రాసి పారేసి అబ్బాయి పేరుతో, తక్షణం తండ్రిమీద దావా దాఖలు చేదాం.

లింగ— తండ్రిమీఁదనే కాదు. దానినిగూఁడఁ గోర్టునక్కీడ్చి తెప్పించి నలుగురిలో నగ లూడ దీయించినఁ గాని, నాకసి తీఱదు.

వెంగ— అదేంతపని? పసిపిల్లను నగలతో పరారీచెయ్యడానికి సిద్ధంగా వున్నారని చెప్పి, యింజక్షను ఆర్డరు పుచ్చుకుని, యిట్టే యీడ్పించుకు రావచ్చును. కోర్టులో మన మాటంటే యిపుడు కోటిరూపాయల కిందన చలామణీ అవుతూవుంది.

లింగ— ఇంకొకటి. మనకు మనోవర్తి బాధ లేకుండ ఈ సంబంధ మింతటితోఁ దప్పిపోవు దారికూడఁ జూడవలెను.

వెంగ— దాని కేముంది. ప్రతిరాత్రి మునసబుగారు పేకాటకుమన యింటికి వస్తూనే వుంటారు. ఇది నా స్వంతవ్యవహారం వంటి దని చెప్పితినా, ఆయన స్వంతకార్యం కింద చూస్తారు.

లింగ— సరే. సాయంకాల మబ్బాయినిఁ గూడఁ దీసికొని వచ్చెదను. మీరు కోర్టునుండి రాఁగానే నోటీసు వ్రాయుఁడు. (అని లేచును)

వెంగ— వచ్చేటప్పుడు ఫీ జేమయినా తెచ్చి జమకట్టిస్తారు గాదూ?

లింగ— అయ్యో, దాని కేమి? ఆమాట మీరు చెప్పవలెనా? (కొంచెము పరిక్రమించి) ప్లీడరింటఁ గాలు పెట్టగానే, ఫీజు గోల సిద్ధము? ఫీజు ముట్టువఱకుఁ ప్లీడరు పిశాచమే!

గీ. రోగి చావనీ, బ్రతుకనీ ♦ రొక్కమెటులొ
లాఁగఁ జూచును వైద్యుఁడు ♦ లాఘవముగ;
వ్యాజ్యమోడనీ; గెల్వనీ ♦ వాటమెఱిఁగి
పిండుకొనఁ జూచు ప్లీడరు ♦ ఫీజు ముందె!

# రెండవ రంగము

ప్రదేశము : కమల గది.

కమ——(నూలు వడుకుచు) కనుకనే పెద్దలు కదురు తిరిగినను, కవ్వము తిరిగినను కాటక ముండ దని చెప్పుదురు. సందియ మేమి?

గీ. రాట్నచక్రంబు విటు లనేక ♦ రాత్రములును
గాలచక్రంబు కైవడిఁ ♦ గదిలెనేని
విష్ణుచక్రంబువలె శ్రామ ♦ విదళనంబు
చేసి, భూచక్ర మెల్లను ♦ జేత నిడదె!

ఎందులకుఁ జెపుమా నాన్నగారు వచ్చుచున్నారు! (అని లేచును)

పురు——(కాగితము చేతఁ బట్టుకొని ప్రవేశించి) అమ్మా! వియ్యంకుడుగారు చివరకు వీధి కెక్కినారు! ఇదిగో నోటీసు.

కమ——ఏమని?

పురు— చదివెద వినుము. (అని యిట్లు పఠించును)

"బి. యే, బి. యెల్" హైకోర్టు వకీలు, నెల్లిబుర్తి లింగన్నగారి వద్దనుంచి, పుణ్యమూర్తుల పురుషోత్తమరావు పంతులుగారికి, అయ్యా! మాక్లయింటు సింగరాజు బసవరాజు గారికి, మీకొమార్తె కమలను యివ్వడం మూలకంగా వివాహం కాబడ్డట్టున్నూ, వివాహకాలంలో మాక్లయింటు మీపిల్లకు నాలుగువేల రూపాయల కిమ్మత్తుగల నాణ్యమైన బంగారం నగలు వుంచబడ్డట్టున్నూ, సదరు నగలను మీరు హరించడం దురుద్దేశ్యంతో, సదరు చిన్నదాన్ని కాపరానికి పంపకుండా వుండబడ్డట్టున్నూ, మీపైన దావా వగైరా చర్య జరిగించేదిగా మాకు సమజాయిషీ యివ్వబడివున్నారు. ఈ నోటీసు అందిన యిర్వైనాలుగు గంటలలోగా, సదరు వస్తువులు సహితం పిల్లను కాపరానికి పంపబడి, మావల్ల క్రమమైన రశీదు పొందకుండా వుండబడే యడల, మీ వగైరాలపైన

దావా చేయ్యడమే కాకుండా, మీవల్ల యావత్తుఖర్చులున్ను రాబట్టుకోబడడం కాబడుతుం దని యిందుమూలంగా తెలియ జాయడమైనది. ఈనోటీసు తాలూకు ఖర్చులుకూడ పిల్లతో పంపబడీటి. చిత్తగింపవలెను. వెర్రిబుర్రల వెంగళప్ప"

కమ—సరే, దీనికి సమాధాన మేమియు వ్రాయ వలదు. దావా కూడ దాఖలు కానిండు.

పురు—అమ్మా! నీ యభిప్రాయ మేమో నాకు బోధపడ లేదు. "ఏ న్నిప్పు డేమియు నడుగ వలదు. సమయము వచ్చినప్పుడు సర్వమును దెలుపఁగలను" దని నీవాడలోఁ జెప్పియుండుటచేత నిన్నేమియు నిర్బంధించి యడుగ లేదు. కాని, యేమి యుపకృతి వచ్చునోయను నాందోళనముమాత్రము తీరకపోలేదు. అదిగాక,

గీ. పగులఁకుం దాస్య మొనరించి ♦ పరువు మాలి
బ్రతుకఁ జూచుటకంటెను ♦ బస్తు మేలు!
సరస మెఱుఁగనివారితో ♦ జగడ మాడి
కోర్టు కెక్కుట కంటెను ♦ గొంతె మేలు!

కమ— అది నిజమే కాని యీవ్యవహార మట్టిదికాదు. దీనికై మీ రించుకయు దిగులుపడవలసిన పనియు లేదు. సర్వము నాకు విడిచిపెట్టి మీరు, శాంతమనస్కులరై యుండుఁడు.

పురు— సరేకానిమ్ము. నీమాటయే నాకునిట్టాట. (నిష్క్రమించును)

కమ— (ఆకసమువంకఁ జేతులు జోడించి) ఓసర్వేశ్వరా!

ఉ. గట్టిగ నన్నె నమ్ముకొని, ♦ కష్టము లోర్చినవారి నేరి, చే
పట్టి, భరించు కేవల కృ ♦ పామయ మూర్తి వటంచు నెట్టనం
బట్టితి నీదుపాదములు, ♦ బాలను, బేలను, దీనురాల, న
న్నెట్టులు తేల్చెదో! తరుణ ♦ మియ్యదిసేయుమి దాయవచ్చెడున్.

తెర పడును



# వరవిక్రయము

## నవమాంకము

ప్రదేశము : న్యాయస్థానము.

ప్రవేశము, న్యాయపీఠమునఁ గూర్చుండి, అభియోగపత్రము చదువుకొనుచు న్యాయాధిపతి యెదుటఁ గుర్చీలో జెంగళప్ప, అతని వెనుక నిలుచుండి లింగరాజుగారు, బసవరాజు రెండవవైపునఁ బురుషోత్తమరావుగారు, వకీలు.

పురు—(తనలో) నిజమే. కోర్టెక్కుటకంటెఁ గొఱత యెక్కుటే మేలు!

చ. మనుజుని ముందట నొక్కరడు ♦ మాదిరిగా మనుజుండు నిల్చి, వే
ర్మనుజుఁడు బల్ల గ్రుద్దుచును ♦ మాటికి మాటికి నేమి ప్రశ్న వే
సినఁ దలయొగ్గి యుత్తరము ♦ చెప్పుచు, మార్పులు పుచ్చుచుంట కం
టెను నవమాన మింకొకటి ♦ నిక్కముగా మహిలోన నున్నదే.

సీ. ధనలోభమో, పట్టు * దలయొ, దురాశయో
వేధింప నిలువెల్ల * వెఱ్ఱి యెత్తి
కూటసాక్ష్యములను * గూర్చికొని, యిండ్లు
వాకిళ్లు ముదునళ్ళ * వశ మొనర్చి
బోర్డుకర్లు సేయు దు * ర్బోధలు మది నమ్మి
ప్లీడర్లు గోరిన * ఫీజు లిచ్చి
పూటకూళ్ళిండ్ల నూ * ద్పులు నాకి, వారి పం
చల దాటియాపుఁ జా * వలఁ బరుండి

కోర్టె దేవాలయంబుగాఁ, ♦ గోర్టు నెదుటి
మట్టులుం గంగరావులై ♦ మంటపాది
కములుగా, జడ్జి దైవంబు ♦ గాఁ నిరంత
రంబుఁ దిరుగుదు రేమిక ♦ ర్మంబొ ప్రజలు!

ఇంతకును—

సీ. కరణము తొలి మలి ♦ కట్నాలక్రింద
కూటసాక్షుల గోలు ♦ గుడులక్రింద
వెంటఁ దోడ్తెచ్చు సే ♦ వెంటు కర్చులక్రింద
ప్లీడర్లు లాగెడు ♦ ఫీజుక్రింద
చల్లగాఁ బెరిగిన ♦ స్టాంపు డ్యూటీక్రింద
తెమలని సాక్షి బ ♦ త్తెములక్రింద
కోర్టు గుమాస్తాల ♦ కొల్లు ముద్దులక్రింద
కడ లేనియట్టి న ♦ కళ్ళక్రింద
రైళ్ళక్రిందను, కాఫీ హో ♦ టేళ్లక్రింద
కొంపలుం గోడలును మాపు ♦ కొనుచు, నోడు
వాఁడు బయటను, గెలిచిన ♦ వాఁడు లోన
నేడ్చుటే గాక, లాభ మిం ♦ తేని గలదె!!

బస—(తనలో) పెంపుడుతండ్రి చివరకు నన్నెంత పేలవపఱిచెను ?

గీ. పెండ్లి కాఁగానె చదువు మా ♦ న్పించెఁ! బ్రజలు
కేరడము సేయఁ గోర్టుకె ♦ క్కించె నేఁడు!
ధనమె బ్రతుకైన పెంపుడు ♦ తండ్రికంటె
సవతితల్లియె మేలు ని ♦ శ్చయముగాను!

న్యాయా—(కాగితములు బల్లపై నుంచి) వెంగళప్పగారూ! ఈవ్యవహార మింతవఱకు రావలసినది కాదండీ! ఉభయులకును రాజీ చేయుట యుక్తమని నా యభిప్రాయము.

వెంగ—(లేచి) కోర్టువారల్లా సెలవిస్తే కొంప మునిగిపోతుంది! మా క్లయింటువంటి మర్యాదస్తుడు మద్రాసులో కూడా లేడండి. ఆయన పెళ్లికి అయిదువేల అయిదువందల కట్నం యిచ్చారు!

లింగ—(వెనకనుండి మెల్లగా) అయ్యయ్యో! ఆసంగతి మన మొప్పుకొనఁగూడ దయ్యా బాబూ! ఆయనతండ్రి కని దిద్దుకోండి!

వెంగ—అన్నట్టు పొరపాటు మనవి చేశాను, ఆయనకు గాదు కట్నం ఆయన కొడుక్కు. కాదు, కాదు తండ్రికి! ఆయనతండ్రి లక్షాధికారండి. మూడు పెళ్లిళ్లయినాయి. ముప్పయి వేలు కట్నాలు వచ్చాయి! మ్యూనిసిపల్ మెంబరుకోసం మూడు సార్లు స్టాండైనారు.

న్యాయా—(నవ్వి) ఆయనచరిత్ర యిప్పు డవసరము లేదు కాని, రాజీ మాట రవంత యాలోచింపుఁడు!

వెంగ—ఈవిషయంలో యీశ్వరుడు చెప్పినా మాక్లయింటువినడండి. దావా మాపక్షం కావడానికి పట్టుమునిగాకుంది. బోలెడు సాక్ష్యంవుంది. అలహాబాదు ట్వంటీత్రీలో అత్తవారు పెట్టిన నగలు హరించకూడదని అయిదు పేజీలు వ్రాశాడు! కలకట్టా ట్వంటీ ఫోర్లో పిల్లను కాపరానికి పంపితీరాలని వుంది!

న్యాయా—మీతీర్పులన్ని యుఁ దీరికసమయమునఁ జూచెదను! ఏమి లింగరాజుగారూ! మీ అబ్బాయిని మీ రొప్పింపలేరా?

లింగ—చిత్తము చిత్తము. కోర్టువారిచిత్త మట్లున్నప్పుడు కోటిరూపాయలు పోయినఁ బోవుఁ గాక! మానగలు మాకిచ్చి, మా ఖర్చులుమాకిచ్చి, వారికిని మాకును సంబంధము లేకుండఁ జేసి కొనుటకు వారిష్టపడిన యెడల, మా అబ్బాయిని నే నొప్పించెద.

న్యాయా—(పక్కున నవ్వి) ఏమీ, కోడ లేల నడిగిరాదు!

లింగ—ఆపిల్ల మాయింట నణకువతోఁ గాఁపురము సేయదండి.

న్యాయా—ఏమి పురుషోత్తమరావుగారూ! అమ్మాయికి నచ్చచెప్పి అత్తవారి యిష్టానుసారముగ నడచుకొనునట్లు చేయలేరా?

పురు- అయ్యా! నే ననహాయవాదిని అందువల్ల మీ ప్రశ్నమున కుత్తర మొసంగుటకు నా కవకాశము లేదు.

న్యాయా— న్యాయాధిపతిగాఁ గాక గృహస్థుఁడుగా నడుగుచున్నాను.

పురు— ఇది న్యాయస్థానము కాని తమ గృహము కాదు.

న్యాయా—అట్లయిన, నీ వ్యవహార మిఁక నిరుపక్షములకు అనుకూలముగా నిర్వర్తించుటక వకాశము లేదన్నమాటయే!

వెంగ—ఆసంగతి నే నాదిలోనే మనవిచేశాను.

కమ— (తనలో)

మ. మనమా! జంకకు, ధైర్యమా చెడకుమీ. ♦ మానంబ! నీమానశో
ధనకాలం బిదె, దైవమా! యిపుడె చెం ♦ తంజేరి సాయంబు న
ల్పి నమం దేల్చుముహూర్త! మిత్తఱిని ద ♦ ల్లీ! భారతీ నాదువా
క్కున నిల్వంబడుమక్కరో! కదిసి, నా - కుందోడుగానుండుమీ!

న్యాయా—అందుచేతనె మీరు వకీలును బెట్టుకొనలే దన్నమాట.

కమ—(కొంచెము ముందునకు వచ్చి) అయ్యా! తామధిష్ఠించినది ధర్మపీఠము తాము ధర్మదేవతకుఁ బ్రతినిధులగు. తమ కాఁడుబిడ్డ యున్నయెడల, నా బిడ్డయె యీ బిడ్డ యనుకొని తమ సన్నిధానమున ధర్మము విన్నవించుకొనుటకు నా కనుజ్ఞ దయచేయుఁడు!

వెంగ—(చివాలున లేచి) నో! నో! నో! ఆ చిన్నది మాట్లాడడము అశాస్త్రీయం! అందుకు లా యెంతమాత్రం వప్పదు. ఏదీ సివిల్ ప్రొసీజరుకోడెక్కడుంది. (అనిబల్లమీఁద వెదకును)

న్యాయా—ఏమీ? ఏల మాటాడఁగూడదు.

వెంగ— ఆపిల్లకు మైనార్టీ వెళ్ళలేదండి. మైనార్టీ వెళ్ళనివాళ్ళు మాట్లాడగూడదని బోలెడు బొంబాయితీర్పు లున్నాయి.

కమ— అయ్యా! చట్టము వేఱు సందర్భము వేఱు. సందర్భములను

బట్టి చట్టములు మాఱునుగాని చట్టములనుబట్టి సందర్భములు మాఱవు. నాతండ్రిగారు రసహాయవాదులు. నాకు వకీలును బెట్టుకొనుట కవకాశము లేదు. చట్టమునందుఁ జెప్పఁబడిన యాదు రాకపోయినను స్వవిషయమును సమర్థించుకొనుటకుఁ జాలిన జ్ఞానమును సర్వేశ్వరుఁడు నాకుఁ బ్రసాదించినాఁడు. ఇట్టిస్థితిలో, నామాట వినకుండుట నాకన్యాయము చేయుట కాదా!

న్యాయా—చెప్పమ్మా చెప్పు! నీవు చెప్పినమాటలు రికార్డు చేయఁ గూడ దనవచ్చునుగాని నన్ను వినఁగూడ దనుటకు ఏ రెవరు!

కమ—చిత్తము చిత్తము. దావా సారాంశములు రెండు. మొదటిది నా తలిదండ్రులు నా నగలు హరింపఁ దలఁచినారని. రెండవది అందులకై వారు నన్నుఁ గాపురమునకుఁ బంపలేదని. (నగల మూట తీసి) ఇవిగో వారిడిన వస్తువులు. వీనిని వారు వివాహ కాలమున నాకు బహూకరించినారు. బహూకరించిన వస్తువులు దిరుగఁ బరిగ్రహించుటకు దాతకు హక్కులేదు.

వెంగ—కావలసినంత హక్కుంది. కలకత్తాతీర్పులు లక్షచూపిస్తాను. ఏదీ నంబరు వైట్ వాల్యూము. (అని వెదకును)

న్యాయా—ఆఁగవయ్యా నీ యల్లలాట కాల? అమ్మాయి. రెండవ సారాంశమును గూర్చి యేమి చెప్పెదవు?

కమ—ఇదియే తామించుక శ్రద్ధతో వినవలసిన విషయము. నాభర్త నాయింటికి వచ్చి, నా యాజ్ఞానుసారము నడచుకొనవలసి యున్నదిగాని ఆయనయింటికి నన్ను రప్పించుకొనుట కాయన కావంతయు నధికారము లేదు.

వెంగ—కావలసినంత అధికారం వుంది. కలకత్తా ట్వెంటీ సిక్సులో కాళ్ళూ చేతులూ కట్టి తీసుకుపోవచ్చునని కూడావుంది.

న్యాయా—అబ్బబ్బా! నీవాఁగవయ్యా? ఎందుల కధికారములేదమ్మా?

కమ—ఆయనను, మేము వేలములో అయిదు వేల యైదువందల రూపాయలకుఁ గొన్నాము.

న్యాయా—(ఆశ్చర్యముతో) అ దెట్లు?

కమ — నాకుఁ గాళింది యను నక్కగా నుండెడిది. ఆమెకై మార్తాండ్ల గారి సంబంధముకొఱకు యత్నించుచుండ మున్సంగివారు పోటీకి వచ్చినారు. అప్పుడు పెండ్లికొమరుని వేలము జరిగి ఆవేలములో అయిదువేల అయిదువందలకు మాసొత్తయినారు.

లింగ — అయ్యో! వట్టిది వట్టిది! అట్టిదేమియు జరుగలేదు! (వెంగళప్పను చఱచి) నీబొడ్డు పొక్క! నిజముకాదని చెప్పవేమయ్యా!

వెంగ—(ఉలికిపడి లేచి) అయ్యా! అయ్యా! అంతా అబద్ధమండి. కావలిస్తే మాక్లయింటు గంగలోదిగి ప్రమాణం చేస్తాడు.

కమ—రెండు కాగితములు తీసి) అయ్యా! యిదిగో యిది మొదటి అగ్రిమెంటు. ఇది సొమ్ము ముట్టినప్పటి రసీదు. [అని ఇచ్చును]

న్యాయా—(చదివి) ఏమయ్యా! యీ రసీదులు మీ రిచ్చినవేనా?

లింగ—(నొల్లున) కావు! మహాప్రభో! కావు! కల్పించినారు.

వెంగ—నిశ్చయంగా ఫోర్జరీ అండి. నిలువునా ఫోర్జరీ! ఇండియన్ పినల్ కోడ్డు నాలుగువందల అరవయ్యేడో శెక్షను ప్రకారం ఆపిల్ల మీద ప్రాసిక్యూషనుకు ఆర్డరు దయచేయించక తప్పదు.

న్యాయా—అయితే, అమ్మాయి! అగ్రిమెంటుప్రకారము ఆసంబంధము మీయక్కకేల జరుగలేదు?

కమ—కొనితెచ్చిన వరుని పెండ్లియాడుట గౌరవహీనమని మాయక్క శావిలోఁబడి మరణించినది. ఇదిగో యీ పత్రికఁ జిత్తగించి నచో దమ కీ యంశము విశదము కాఁగలదు. (అని పత్రిక యిచ్చును.)

న్యాయా—(చదివి) హరహరా! యెంతపని జరిగినది. ఆకారణముచే ఆ చిన్నదానికి నిన్నుఁ జేసినా రన్నమాట

కమ—చేయక తప్పినది కాదు. చేజిక్కిన సొమ్ము మరల చేస్పుటకు వారు నిరాకరించినందున ఆక్రయము నాక్రింప మార్చవలసి వచ్చింది.

లింగ—అయ్యా! వాదమునిమిత్తము, వారు సొమ్మిచ్చినట్లే నిశ్చ యింపుడు. అయిన నది కట్నమగునుగాని క్రయధనమెట్లగును?

కమ—కట్నమునకును గ్రయధనమునకును గాసింతయు భేదములేదు. ఉన్న దన్నను కట్నములు వివాహకాలముస నిచ్చుటకలదుగాని వేలము, బజానా, అగ్రిమెంటు, ముందు చెల్లింపుల ఇట్టి యాచార మెచ్చటను లేదు. అందువల్ల నిది క్రయధన మగుట కాక్షేప మేమియు లేదు. అది యటుండనిండు. శుభలేఖలలో సర్వత్ర "వారి కుమారునకు మీకొమార్తెనిచ్చి" అని కదా యుండును? వీనినిం జిత్తగింపుడు (అని రెండుశుభలేఖలిచ్చును)

న్యాయా—(ఒక శుభలేఖ నెత్తి) "నాకొమార్తె చి॥ సౌ॥ కమలకు బ్రహ్మశ్రీ సింగరాజు లింగరాజుగారి కుమారుడు బసవరాజు నిచ్చి" (అని పఠించి, పక్కున నవ్వి) ఇది పురుషోత్తమరావు గారి శుభలేఖ. లింగరాజుగారి శుభలేఖలో నెట్లున్నదో? (అని రెండవదాని నెత్తి "నాకుమారుడు చి॥ బసవరాజును బ్రహ్మశ్రీ పుణ్యమూర్తుల పురుషోత్తమరావు పంతులుగారి కొమార్తె చి॥ సౌ॥ కమలకు ఇచ్చి" సరే యిక నేమి స్పష్టము గానే యున్నదే! ఏమి లింగరాజుగారూ! మీకుమారుని నామె కిచ్చివేసినట్లు మీ రొప్పుకొనియే యున్నారే?

లింగ—అయ్యా! అన్యాయ మన్యాయము. మాశుభలేఖలతో పాటు మాకుంగూడఁ గొన్ని యచ్చువేయించి పెట్టుడని బుద్ధి గడ్డితిని పురుషోత్తమరావు గారిని కోరగా ఈద్రోహమాయన చేసినారు.

వెంగ—ఇదో ఫోర్జరీ. ఇందుకోసం యీయనమీద కూడా వ్రాసినన్యా మనుకు ఆర్డరు దయచేయించాలి. ఇక పూరుకోనడానికీల్లేదు.

కమ—అయ్యా! ఆయన యేమియు నెఱుఁగరు. నాకుఁగలహక్కును బట్టియుఁ న్యాయమును బట్టియు నేనే యావిధముగా మార్చి

నాను. అందులకు నా రప్పు జేమియు నభ్యంతరము చెప్పి యుండలేదు. తామీ సందర్భములన్నియుఁ జక్కఁగా నాలోచించి, నాపై నాభర్తకే యధికారము కలదో, నాభర్తపై నాకే యధికారము కలదో, నిర్ణయింపుఁడు.

బస— (తనలో) నా యవజ్ఞతచేతనే యీవ్యవహార మింతవఱకు వచ్చినది. ఇంకను నేనిట్లు మొరడునై యుండఁ దగునా?

చ. పరువు నశించె! బండితులు • బామరులు న్విని, యింటనింట నా చరితము చెప్పుకొంచు నెక • చక్కెములాడు నవస్థ పట్టె! ము ష్కరమునఁ దండ్రి కిప్పటికిఁ * గల్గక పోయె నుదారబుద్ధి! యీ తరుణమునందు మూకుని వి * ధంబున నుండుట నాకుఁ బాడియే.

గీ. ఆమె చెప్పిన దెల్ల య * థార్థ; మీతఁ
డాచరించిన దెల్ల నా • యాత్మ యెఱుఁగు;
నిట్టిచో న్యాయమున కేను * గట్టువడక
యున్న దేవుఁడు ననుఁ జూచి * యోర్చువాఁడె.

న్యాయా— ఏమి వెంగళప్పగారూ! మీరేమి చెప్పెదరు?

బస—(అంతలో ముందునకు వచ్చి) అయ్యా! యిప్పుడు మాటాడ వలసినవాఁడను నేను గాని, ఆయన గాదు. ఈ దావాకు సంబంధించిన కాగితములపై నేను సంతకములు చేసినది. నా తండ్రి బలవంతముచేఁ గాని, నా స్వబుద్ధిచేఁ గాదు. అందువల్ల నా దావాను నేను రద్దు చేసికొనుచున్నాను. ఆచిన్నది చెప్పిన మాటలలో నణువంతయు నసత్యము లేదు; నాతండ్రి మాటలలో నలుసంతయు నిజము లేదు! ఈవ్యవహారములో నాతండ్రి చేసిన దుస్తంత్రము లన్నియు నిచ్చట వెల్లడించుట నా కిష్టము లేదు: పెక్కుమాటలేల?

ఉ. అమ్మె నన్ను నాజనకుఁ, ♦ డాయన నన్గొనె రొక్కమిచ్చి; యీ
కొమ్మకు నేను భృత్యుఁడను, ♦ గొంకక యేపని సేయు మన్న ని
క్కమ్ముగఁ జేయువాఁడ, నిటు ♦ కట్నములం గొనువారురూఢిగా
నమ్ముడు కాండ్రె కాక, మగ ♦ లంటకునర్హులు కారు లేశమున్.

సౌద్రియా— సెబాసు. నాయనా సెబాసు! చెప్పవలసిన రీతిగా జెప్పితివి! కాని, చెప్పినది చెప్పినట్లు చేయుటగూడ జరిగెనేని, లోకమున కొక శ్రేష్ఠమైన పాఠము నేర్పినవాఁడ వగుదువు!

బస— అయ్యో! తమకాసందేహ మేల? (అని కమలవంకకు నడచును)

లింగ— (ఆవేదనతో) ఆఁ; ఆఁ; ఆఁ; ఓరి నిర్భాగ్యుఁడా! నిర్భాగ్యుఁడా, నీకేమి వినాశకాలమురా యిది. అయ్యో! అయ్యో! ఇంకే మున్న దింకే మున్నది! (అని గుండె బాదుకొనును)

బస—(తిరిగి చూడక యె కమలను సమీపించి) ఓ సుగుణవతీ!

చ. ధనమె గణించి, నీ యెడల ♦ దారుణవృత్తి మెలంగియుండె మ
జ్జనకుఁడు, దాని నించుకయు ♦ స్వాంతమునం దిడఁబోక నన్ను దా
సునిగ గ్రహించి యిష్ట మగు ♦ చొప్పున నానతు లిమ్ము నీవు చె
ప్పిన పని చేయు నెల్లపుడు ♦ భృత్యుఁడనై పడియుందు నీకడన్.

కమ— (మందహాసముతో) ఇదిగో, యీ నగలమూటయు, నీ కాగితముల కట్టయుఁ బట్టుకొని నా వెంట రండు. ఇరువురమును గలిసి యీ వరవిక్రయ దురాచారమును రూపుమాపుటకై పాటుపడుదము. (అని మూటయుఁ గట్టయు నిచ్చును.)

బస—(తీసికొని, తలపై నిడుకొనును)

లింగ—ఓరి నీచుఁడా! చివర కింత నైచ్యమునకు సిద్ధపడితివిరా! ఇదిగో, నా యాస్తినుండి నీకు నలుసంత మాత్రనిచ్చితినా, నా మెడలోనిది యజ్ఞోపవీతము కాదు. (అని చనుచుండఁ దెరవడును.)

ఇది నవమాంకము.



# వరవిక్రయము

## దశమాంకము

ప్రదేశము ; రాజవీధి

(ప్రవేశము: పురుషోత్తమరావుగారు, బసవరాజు, భ్రమరాంబ, కమల)

పురు—సీ. కొసరి కట్నము లందు ♦ కొంటయే గౌరవ
మని తలపోసెడి ♦ యజ్ఞులార!
పచ్చి ముద్దుగఁ బిల్ల ♦ నిచ్చెద మనఁ గట్న
ములకు బేరము లాడు ♦ మూర్ఖులార!
అబ్బాయి పెండ్లితో ♦ నప్పు నప్పులు తీర్చి
నిలువ సేయఁగ జూచు ♦ నీచులార!
ముడుపులు గొని తెచ్చి ♦ ముంగల నిడుదాఁక
పల్లకి యెత్తని ♦ పశువులార!
ఏమి యన్యాయ మిది! పూర్వ ♦ మెన్నఁడేని
వరుల నిటు విక్రయించిన ♦ వారు గలరె?
పూజ్యతరమైన మన పుణ్య ♦ భూమియందుఁ
గటకటా! నరమాంస వి ♦ క్రయము తగునె.

బస—సీ. కట్నాలకై పుస్త ♦ కములు చేఁ గొని, పాఠ
శాలల కేగెడు ♦ చవటలార!

పిలిచి కాళ్ళు కడిగి పిల్ల నిచ్చినవారి
కొంప లమ్మించెడి కుమతులార!
అల్క పాన్పుల నెక్కి యడిగినది కావలె
నని శివమాడెడి యధములార!
ఎంత పెట్టినఁ దిని యెప్పటి కప్పుడు
నిష్ఠురోక్తులె పల్కు నీచులార.
కట్నము పేర నొక చిల్లి గవ్వఁ గొనిన
భార్య కమ్ముడుపోయిన జంతు లగుచు
జన్మదాస్యంబు సలుపుఁడు సలుపకున్న
నత్తవారింటఁ గుక్కలై యవతరింత్రు.

క్రమ—సీ. మగబిడ్డ పుట్టిన మఱునాఁడె మొదలు శు
ల్కములె లెక్కించు రాకాసులార!
మర్యాదకై చూచు మఱలఁ గట్నాలకై
రేపవల్ వేధించు తేచులార!
అయిదు ప్రొద్దుల రాణులై, చీటికిని మాటి
కలిగి కూర్చుండు నయ్యాళులార
లాంచనంబుల పేర లక్ష చెప్పుచు నిల్లు
గుల్ల సేయు దరిద్ర గొట్టులార.
ఆఁడుపుట్టువు పుట్టరే? ఆఁడువారి
నిట్టు లవమానపఱచుట కించుకేని
సిగ్గు పడకుండఁ దగునె? ఛీ, ఛీ, ధనంబె
పావనంబుగఁ జూచుట పరువె మురువె.

కమ—సీ. వెల పుచ్చుకొనవచ్చు వెడఁగులచేఁ బుస్తె
కట్టించుకొనియెడు కన్నెలార.

కట్నాల మగలతోఁ గలిసి పల్లకిలోనఁ
గూరుచుండెదు పెండ్లి కూతులార!
కోరిన వెల యిచ్చి కొని తెచ్చుకొన్న దా
సులకు దాస్యము సేయు సుదతులార
మీ వివాహములకై మీవారు ఋణముల
పాలౌట గని యోర్చు పడఁతులార
ఎంచిచూడఁగ స్త్రీజాతి కింతకన్న
గౌరవము లేని పని యొంతు కలదె? చాలుఁ
జాలు నీకైన పౌరుష జ్ఞానములను
గలిగి మెలఁగుడు సత్కీర్తిఁ గనుఁడు వినుఁడు.

ఒక బ్రాహ్మణుఁడు—(ప్రవేశించి) అయ్యో! కట్నపు సొమ్మంటే కాలకూటవిషము సుమీ. దానివల్లనే నాకీ దరిద్రయోగము పట్టినది!

సీ. తగినవరము వచ్చు దాఁక నబ్బాయిని
పాఠశాలకు తన్ని పంపినాను
పోటీలపై వెల పొసఁగించి నాలుగు
సంచుల వరహా కక్కించినాను
మాటిమాటికిని బోట్లాటకు సిద్ధమై
లాంఛనా లని వేయి లాఁగినాను
అద్దుల కీవచ్చునని యున్న సొమ్మెల్ల
పెట్టి పెంకుటి యిల్లు కట్టినాను
ఇల్లు కాలిపోయె ఇంటిది చనిపోయె
పిల్లవాఁడు వెఱ్ఱి పీనుఁ గాయె
కోడ లాకనిఁ దగులు కొని లేచియే పోయె
నాకు ముష్టిచెంబె లోక మాయె (నిష్క్రమించును)

ఒక [illegible]—(ప్రవేశించి) అయ్యో! నా సొంత [illegible]

సీ. వాడ్డికి వాడ్డీల వాంతున పెంచేసి
మంచి మాన్యాలు గడించినాను
పదిపుట్ల బూమితో పండంటి బిడ్డనో
యెదవ కాకిక్కలకొడుకిచ్చినాను
అలక పానుపుకాడ అవలైన తంగెలి
బీడాడి కడుపున పెట్టినాను
అన్ని తిన్న యెదవ అమ్మాయి నొదిలేసి
యింకోర్తి పక్కలో యిమిడినాడు
నాకు కూడు లేదు నాబిడ్డ కిప్పుడు
కూడు, గుడ్డ, కొంప కూడ లేవు
అయిన వెల్ల నేర్చి అల్లుడోళ్ళకు పెట్టు
కమ్మ నచ్చినోళ్ళ కర్మ వింతె. (నిష్క్రమించును)

ఒక సెట్టి—(ప్రవేశించి) నా కతగూడా సెబుతాను నన్నాకండేం.

సీ. పెసలలో, సోళ్లలో, బెడ్డలు కలిపివేసి
పెజల నెత్తోలు గొట్టి పెంచినాను
మేనల్లు డింట్లోను మిడుకుతుంటే, పిల్ల
నింకోరి సినోడి కిచ్చినాను
గళ్లన పదివేలు పళ్ళెంలో పోసి
సకల మర్యేదలూ జరిపినాను
గుంటూరు మేళవూ, గూడూరి సుందరి
పీకపాటా పిలిపించినాను
అయిదురోజులా జట్టెప్పకాడినాను
తెలక రొండు దివాళాలు తీసినాను
మొల్లి [illegible] కొట్టెకిస్తాను
[illegible] పట్టినాను,

లింగ—(చటాలునఁ బ్రవేశించి) బావగారు! ఇదివరకు, వందినిబాడి బం టనిపించుకొన్నారు! మీ ప్రబోధము వినుచుఁ, బ్రచ్ఛన్నముగా నేనును మీవెనుకనే వచ్చుచున్నాను. ప్రజలలో మిమ్ములను మీ కొమార్తెను, మీ యల్లునిఁ బ్రశంసింపనివారును, నన్నును నా భాగ్యమును బరిహసింపనివారును లేరు!

సీ. కట్టక, ముట్టక, ♦ కడుపున కేనియుఁ
గుడువక డొంకకొంత ♦ కూర్చినాను!
వడ్డికి వడ్డీల ♦ వంతునఁ బొడిగించి
పెనకువప్పెఁ గొంత ♦ పెంచినాను!
వద్దులు పత్రముల్ ♦ దిద్ది, దీవముఁలార్పి
వంచించి కొంత గ ♦ డించినాను!
తా యమ్మ కనరమ్మ, ♦ కడు గమ్మ, వో ట్లమ్మ
చిల్లరగాఁ గొంత ♦ చేర్చినాను!
అతిథి, చుట్టము, గురువును, ♦ యాచకుండు,
దేవుఁ డనుమాట లేక వ ♦ ర్తించినాను!
కడకుఁ గట్నంబునకు గడ్డి ♦ కఱచినాను!
కలఁడె నావంటి ఖలుఁడు లో ♦ కంబునందు!

పురు—బావగారు! గతజలసేతుబంధనమువల్లఁ గార్య మేమున్నది? ప్రస్తుతము తాము దయచేసిన పని యేమో సెలవిండు!

లింగ—ఇఁక నా కేమి పనియున్నది! అబ్బాయినిఁ, గోడలిని ఇంటికిఁ దోడుకొనిపోయి ఆస్తి యంతయు వారివశము చేసి, హాయిగా మీతో హరినామస్మరణ చేసికొనుచుఁ గూర్చుండవలె నని వచ్చినాను.

పురు—ఈమాటలు మీరు మనస్ఫూర్తిగా నన్నవేనా?

లింగ—సందియ మేమి? నాకోడలిని సమాధానపఱచి, నాకుమారుని మరల నావానిఁగాఁ జేసికొనవలెనన్న, రేపు వాఁడున్నాఁడుఁ గర్మ

చేయుటకు గాని, వారు చేసినకర్మ నాకు చుట్టుకొనుటకుఁ గాని యవకాశ మెక్కడిది? అప్పు డాలోచనము లేక పాడుకట్నము కొఱ కన్నిపాట్లు పడినాను! ఆ పాపమును బరిహరించుకొను వఱకును నా యంతరాత్మకు శాంతి కలుగదు!

పురు—అట్లయిన మీయిష్టానుసారమే యగుఁగాక! మన మందఱ మును గలిసి యొకసారి మంగళాశాసనము గావించి పోవుదము

సీ. ఆఁడుబిడ్డల వివా ♦ హములకై తండ్రులు
పడు బాధ లెల్లను ♦ బాయుఁ గాక!
లింగ—కట్నాలకోసము ♦ గడ్డి కఱచువారి
కెల్ల నా పాట్లె ఘ ♦ టిల్లుఁ గాక!
బస—వణములు గొనువారు ♦ భార్యల కేప్రొద్దు
నూడిగంబులు సేయు ♦ చుంద్రు గాక!
కమ—వెలమగల్ మొదలంబు ♦ స్త్రీలు కట్టు దౌర్భాగ్య
దశ కన్నియల కింకఁ ♦ దప్పుఁ గాక!
భ్రమ—కట్నముల నందుకొంటయే ♦ గౌరవ మను
వెడఁగుదన మూఁడువారిని ♦ వీడుఁ గాక!
అందఱు—ఉర్వి నన్నిటఁ గాలించి ♦ [illegible]
వెలఁదులే మెప్పుకును బ్రభ ♦ [illegible] [illegible]!

శ్రీమజ్జగద్గురు శంకరభగవత్పాద ప్రసాదాసాదిత మహాకవి బిరుదాంకిత
భారద్వాజ గోత్రార్ణవ శశాంక, కవిశుంఠాగళపాశ హస్త
కాళ్ళకూర్యన్వయప్రశస్త, బంగారురాజ కవిరాజ
తనూజ, నారాయణరాయామాత్య విరచిత
ప్రణీతంబగు వరవిక్రయ ప్రకరణము
సంపూర్ణము

---

శ్రీ శ్రీనివాస ప్రెస్, రాజమండ్రి—ఇ. జి. 38 1000—1947.

# వైద్యగ్రంథములు



| | రు. | అ. | | రు. | అ. |
|---|---|---|---|---|---|
| శార్ఙ్గసంహిత | 3 | 0 | శైరాగిచిటికలు పెద్దది | 0 | 8 |
| వస్తుగుణదీపిక మో॥సు॥గారు | 5 | 0 | నాడీపరిజ్ఞానం | 0 | 8 |
| సర్వమూలికాయోగమం | 5 | 0 | నలభీమపాకశాస్త్రం | 0 | 12 |
| తిబ్బెఅక్బరుషాహీఅను | | | మిలటరీపాకశాస్త్రం | 0 | 12 |
| యూనానీగ్రంథము | 6 | 0 | వస్తుగుణప్రదర్శిని 300 పే॥ | 1 | 0 |
| చరకసంహిత శ్రీ॥ కృ॥ | 6 | 0 | ధన్వంతరివిజయం | 0 | 10 |
| అనుభవదీపిక డిటో | 1 | 0 | స్త్రీజనకల్పతరువు | 1 | 0 |
| భస్మప్రకాశిక డిటో | 1 | 0 | దంతవైద్యం | 0 | 8 |
| ఆంధ్రభైషజ్య | | | అశ్వలక్షణసారం | 0 | 8 |
| రత్నావళి శ్రీ॥ కృ॥ | 2 | 0 | షర్బత్తుపాకావళి | 0 | 8 |
| బసవరాజీయము | 7 | 0 | చికిత్సారత్నం స్లైజు | 0 | 12 |
| ఆంగ్లేయౌషధగుణదీపిక | 4 | 0 | వైద్యరహస్య | | |
| సిద్ధమూలికారహస్యం | 1 | 0 | చింతామణి 1 వ భా॥ | 0 | 12 |
| పులిప్పాణివైద్యం | 1 | 8 | డిటో 2 వ భా॥ | 0 | 12 |
| యూనానీవైద్యామృతం | 0 | 8 | శతలేహ్యపాకావళి | 0 | 8 |
| కుసుమరోగనివారిణి | 0 | 12 | నేత్రదర్పణం | 0 | 8 |
| గృహవైద్యము 1 భాగం | 0 | 12 | బాలగ్రహచికిత్సలు | 0 | 4 |
| డిటో 2 భాగము | 0 | 12 | డిటో చిన్నసైజు | 0 | 1 |
| ఆయుర్వేదవైద్యామృతం | 0 | 12 | అనుపానమంజరి | 0 | 8 |
| సుఖరోగచికిత్సలు | 0 | 8 | సహదేవపశువైద్యం | 0 | 6 |
| విషవైద్యము | 0 | 8 | వ్రణచికిత్సలు | 0 | 8 |
| రసప్రదీపిక | 0 | 10 | భస్మప్రదీపిక | 0 | 12 |

కొండపల్లి వీరవెంకయ్య అండు సన్సు, రాజమండ్రి.

# మైలవరంకంపెనీవారిచేతను

## తదితరులచేతను ప్రదర్శింపబడు స్టేజి నాటకరాజములు.

| | రు. | అ. | | రు. | అ. |
|---|---|---|---|---|---|
| కనకతార చం. కే. | 1 | 4 | చిత్రనళీయం బళ్లారి డి. కృ. | 1 | 4 |
| సత్యహరిశ్చంద్రీయం బ.ల. | 1 | 0 | విషాదసారంగధర డిటో | 1 | 0 |
| బుద్ధిమతీవిలాసము బ.ల. | 1 | 0 | ప్రహ్లాద డిటో | 1 | 0 |
| శ్రీకృష్ణతులాభారం ము.సు. | 1 | 0 | రోషనార కొ. సు. | 1 | 0 |
| కృష్ణలీల బళ్లారి పం.కె.సు. | 1 | 4 | సావిత్రి (మైలవరం) స. | 1 | 0 |
| లవకుశ డిటో | 1 | 4 | ద్రౌపది (మైలవరం) అ. | 1 | 0 |
| భక్తకుచేల డిటో | 1 | 4 | తులసీదేవి ము. వెం. | 1 | 0 |
| చూడామణి పా. ల. | 0 | 12 | మహాకవి కాళిదాసు హ. | 1 | 0 |
| పాండవవిజయం తి. వెం. | 1 | 0 | గయోపాఖ్యానం చి. ల. | 0 | 8 |
| పాండవోద్యోగములను | | | ప్రసన్నయాదవము డిటో | 0 | 8 |
| శ్రీకృష్ణరాయభారం | 1 | 0 | పారిజాతాపహరణం డిటో | 0 | 8 |
| పాండవాశ్వమేధం | 1 | 0 | చింతామణి కా. నా. | 1 | 0 |
| జయంతజయపాల ఆ. స. | 0 | 12 | పద్మవ్యూహం డిటో | 1 | 0 |
| కాలేజిగరల్ కా. హ. | 0 | 12 | మధుసేవ డిటో | 1 | 0 |
| రంగూన్‌రౌడీ సో. రా. | 1 | 0 | చిత్రాభ్యుదయం డిటో | 1 | 0 |
| ధరణికోట సో. రా. | 1 | 4 | వరవిక్రయం డిటో | 1 | 0 |
| వేణీసంహారము వ. సు. | 1 | 0 | కన్యాశుల్కము గు. అ. | 1 | 0 |
| రామదాసు బళ్లారి డి.గో. | 1 | 0 | శాకుంతల క. వీ. | 0 | 12 |
| బొబ్బిలియుద్ధం శ్రీ. కృ. | 1 | 0 | అనసూయ సో. అ. | 1 | 0 |
| పాదుకాపట్టాభిషేకంపా.ల | 1 | 4 | కంఠాభరణం పా. ల. | 1 | 0 |
| విప్రనారాయణ డిటో | 1 | 0 | మోడరన్ బి.ఏ. య.సూ. | 1 | 0 |
| రాధాకృష్ణ డిటో | 0 | 12 | ఎక్స్‌కాలేజీగరల్ | 1 | 0 |
| లేడీడాక్టరు కా. హ. | 0 | 8 | పెట్టుమారిమగడు కా. వెం. | 1 | 0 |